# తెలుగు స్వతంత్ర

సంపుటి: 4 సంచిక: 9.

శుక్రవారం, సెప్టెంబరు 28, 1951.

## విషయసూచిక

# మన బతుకులు

డి. కృష్ణకుమారి

మన బతుకుల గతుకుల్లో
మసిపూసిన- అతుకుల్లో
తారురో[illegible]——
పోస్తున్నారు- కంకర
కొట్టి చేస్తున్నారు- చదును [illegible]ను-—
ఇదేనట అదును —
వంకర టింకరగా నడుస్తున్నారు జనం
ట్రాఫిక్ డేంజరు బోర్డు పోల్చుకోం మనం
[illegible]ర్లు, [illegible]ర్లు తిరిగి పోతున్నాయి గమనం—
ఇంతేనా? మన బతుకులు
[illegible]మకోం నాలుగు మెతు[illegible]
రోడ్డు కడ్డంగా డేంజర్ బోర్డు
గుడ్డిగా గుద్దేస్తాం—
అబ్బా! తల [illegible]గిలింది!
బోర్డు [illegible]క్రమయం!
మన బతుక్కి అపాయచిహ్నం!
అడుగడుగున ఛీకొ[illegible]
మన చితుకుల బతుకులు
చితిమంటల మహోత్సవములు.
పుష్టిగా బతక లేని ముష్టి[illegible]లం-—
ఒక చేపయినా [illegible]డని జాలరి గాలం
బతక లేక బతుకుతోన్న
మన బతుకులు

# స్వతంత్ర

సంపుటి-4
సంచిక-9

సెప్టెంబరు 28, 1951.

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

## మాటలూ చేతలూ

ఎన్నికల నిర్వహణకు సంబంధించిన ఉద్యోగులందరికీ సుదీర్ఘమైన విజ్ఞప్తి నొకటి చేస్తూ, మద్రాసు ముఖ్య మంత్రి శ్రీ కుమారస్వామి రాజా ఇలా అన్నారు: "నిష్పక్షంగా, లోపరహితంగా ఎన్నికలు జరగాలంటే, ప్రతి ప్రభుత్వోద్యోగి నూటికి నూరుపాళ్లూ సామర్థ్యంతో, నిష్పాక్షికంగా పని చెయ్యవలసి ఉంటుంది. ఆ ఉద్యోగి రిటర్నింగ్ ఆఫీసరు, పోలింగు గుమాస్తా, పోలీసు ఆఫీసరు, లేక కేవలం బంట్రోతు, గ్రామతలయారీ - ఎవరైనా సరే, అందరూ తమ విధి నిర్వహణలో నిష్పాక్షికంగా ఉండితీరాలి."

రాష్ట్ర ప్రభుత్వ కార్య నిర్వాహక శాఖకు ముఖ్యమంత్రి అధినేత. ఎన్నికల నిర్వహణలో నిష్పాక్షికత ఎంత ముఖ్యమైనదో ఆయనే అంగీకరిస్తున్నారు. అటువంటప్పుడు కేవలం ప్రసంగాలూ, హెచ్చరికలు, విజ్ఞప్తులు - వీటి వల్లనే కాక, స్వీయవర్తన ద్వారా కూడా ఆయన తన తాబేదార్లకు మార్గంచూపి ఒరవడి పెట్టవలసి ఉంటుంది. అది ఆయన కనీస కర్తవ్యం. ముఖ్య మంత్రి యీ ప్రసంగం చేసినది గత మంగళవారం రోజున. అదేరోజు ఉదయం 'హిందూ' పత్రికలో ఒక సంపాదక లేఖ ప్రకటింపబడింది. పండిత నెహ్రూ దేశానికిచ్చిన హామీలను జ్ఞప్తికి తెస్తూ (నిష్పాక్షికత, శీలము, వగైరాలు) యిటీవల తమిళనాడు కాంగ్రెస్ ఎన్నికల కమిటీ తిరుచ్చినాపల్లిలో, ప్రవర్తించిన పద్ధతుల్ని ఆ లేఖ విశదీకరించింది. ఓం ప్రథమం ఆ కమిటీ ఒక గృహస్థుని ఇంట్లో సమావేశం అయింది. కాని, ఆ యింటితో ఏమీ నిమిత్తం లేని మునిసిపాలిటీ యింటిని శుభ్రపరుచి, కావలసిన హంగులన్నీ అమర్చింది. కారణం? కమిటీలో ముఖ్యమంత్రీ, ఇంకో యిద్దరు రాష్ట్ర మంత్రులూ ఉన్నారు కాబట్టి. అంతే కాదు: ప్రభుత్వ శాసనానికి విరుద్ధంగా అశోక చక్రాంకితమైన జాతీయ పతాకం ప్రహరీలో ఎగురవేశారు. పార్టీ పనులకు జాతీయ పతాకం వాడకూడదని ఒక మూల శాసనం ఘోషిస్తూంటే యింకోమూల మంత్రులే అటువంటి చర్యలకు దిగుతున్నారు. ఇక, మంత్రులక్కడ విడిది చేశారు కాబట్టి, ఆయింటి చుట్టూరా మాత్రమే కాక, చుట్టుపక్కల వీధులన్నిటా పోలీసులు కాపలా ఉన్నారు. ముఖ్యమంత్రి కుమారస్వామి రాజా ప్రభుత్వపు మోటారుకారులో ఆ మీటింగుకి హాజరైనారు. మోటారు మీద జాతీయ పతాకం ఎగిరింది. ఇంత తతంగమూ జరిగిన తరవాత, అదే

ముఖ్యమంత్రి మద్రాసు వచ్చి, ఉద్యోగులంతా నిష్పాక్షికంగా వ్యవహరించవలసిందని ముచ్చటైన ప్రకటన చేశారు

పైనుండి క్రిందివరకూ పరిస్థితి అంతా యిదే తీరున ఉన్నది. రేపు ఢిల్లీలో కాంగ్రెస్ మహాసభ జరగబోయే ప్రదేశాన్ని పండిత నెహ్రూ స్వయంగా వెళ్ళి పరిశీలించారనీ, అక్కడ కావలసిన మరమ్మత్తులకూ, కట్టడాలకూ కేంద్ర-పబ్లిక్ వర్క్సుశాఖ నియోగించ బడిందనీ, తెలుస్తున్నది. ఇక కాంగ్రెస్ పార్టీకీ, ప్రభుత్వానికీ ఉన్న తేడాను ఎవరు ఎక్కడ సరిగా పాటిస్తున్నట్లు? ఇక ప్రభుత్వ – అధిష్ఠాన వర్గాలవారే యిలా ప్రవర్తిస్తూంటే యిక తక్కిన తాబేదార్లకు క్రమశిక్షణ, నిష్పాక్షికత్వం, ఎలా అలవడతాయి?

కాంగ్రెస్‌లోని కల్మషాన్నంతా కడిగివేసి, దానికొక కొత్తకాంతి, ఉత్తేజం, ఆదర్శం, సేవానిరతి, యిలాటివెన్నో చేకూర్చడానికి నడుం కట్టిన పండిత నెహ్రూ చివరకు పెత్తందార్లను, స్వప్రయోజనపరుల కూటాలను మరింత బలవత్తరం చెయ్యడంలోనే కృతకృత్యులైనారు. ప్రతి రాష్ట్రంలోనూ కాంగ్రెస్ సంస్థ పాలనాయంత్రం ఇదివరకున్న వారి చేతుల్లోనే ఇపుడూ ఉంది. వాళ్ళే ఎన్నికల బందోబస్తులన్నీ చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వాలు వీరి కైవసంలోనే ఉన్నాయి. అటు కాంగ్రెస్ సంస్థకు కార్యదర్శిగా ఉంటూన్న శ్రీ కళావారిని పండిత నెహ్రూ తొలగించారు. ఈ తొలగింపులో యిమిడిఉన్న సిద్ధాంతం ఏమిటి? వెను వెంటనే ఆయన మద్రాసు మంత్రివర్గంలో చోటు చేసుకుని కూర్చున్నారు. ఇటువంటి "నాలుగు స్తంభాలాట"వల్ల నెహ్రూ సంతృప్తి పడితే పడవచ్చుగాని, అంతమాత్రాన ప్రజలువచ్చి కాంగ్రెసును అనురాగంగా కౌగలించుకోరు. తప్పుచేసిన ముద్గల్ పిచ్చుకపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించారు, సరే కాని ఉత్తర ప్రదేశ్ చక్కెర మిల్లు యజమానుల వద్దనుండి బాహాటంగా "కాంగ్రెస్ చందా" వసూలు చేస్తున్న శ్రీ గోవిందవల్లభపంత్ మొదలయిన వారి మాటేమిటి? నెహ్రూ కూడా యీ కలాపాన్ని సమర్థించడం గమనించదగ్గది.

ఆమధ్య ఏదో సందర్భంలో ప్రసంగిస్తూ, పండిత నెహ్రూ – కమ్యూనిస్టుల సిద్ధాంతాలనూ, ఆదర్శాలనూ తాను అంగీకరించకపోయినా, వారిలోని కార్యోత్సాహాన్నీ, క్రమ శిక్షణనూ, స్వార్థత్యాగాన్నీ, మెచ్చుకోవలసి ఉంటుందని అన్నాడు. మంచిదో – చెడ్డదో, కమ్యూనిస్టుల కొక ఆదర్శం వుంది: భవిష్యత్తులో ఒక విశ్వాసం ఉంది. నేటి కాంగ్రెస్ వారికి ఉన్న ఆదర్శం ఏమిటి? దేనికోసం వాళ్లు ఉత్సాహవంతులై, ఉత్తేజితులై స్వార్థత్యాగంతో పని చెయ్యవలసి ఉంటుంది? వాళ్ళంతా నేడు వర్తకం చెయ్యడంలో, పర్మిట్లు సంపాదించడంలో, ఆశ్రితులకూ, బంధువులకూ ఉద్యోగాలు వెదికి పెట్టడంలో నిమగ్నులై ఉన్నారు. ఉన్నతమైన ఆదర్శాలూ, వాటి ననుసరించిన భవిష్యత్తులో విశ్వాసమూ, యీ రెండూ లేనిదే ఎవరైనా ఉత్సాహమూ, త్యాగనిరతీ ప్రదర్శించగల్గుతారని నెహ్రూ అనుకుని ఉండడు. కాని, తను అటువంటిది సంభవమని నమ్ముతున్నట్లుగానే ప్రవచించి ప్రవర్తిస్తున్నాడు.

అక్టోబరు 2 లోపున రాష్ట్రం ఏర్పడకపోతే

# ఆంధ్రుల కర్తవ్యం

ఎ. ఎల్. నరసింహారావు

వెనకబడిపోయిన ఆంధ్రరాష్ట్రసమస్య స్వామి సీతారాం ప్రాయోపవేశంతో తిరిగి ప్రాధాన్యానికి వచ్చింది. ఆంధ్రుల దృష్టి అంతా యీనాడు యీ సమస్యపై కేంద్రీకరించబడింది. భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సూత్రాన్ని కాంగ్రెస్ ఏనాడో అంగీకరించింది. కాని దురదృష్టవశాత్తూ కాంగ్రెస్‌కు తీర్మానాలు చేయడంలో వున్న ఆసక్తి, శ్రద్ధ, పట్టుదల వాటిని ఆచరణలో పెట్టడంలో లేదు. ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెస్ అనేక వాగ్దానాలు చేసింది. దీనిని ఆచరణలో పెట్టింది కనక రాష్ట్ర విభజనను ఆచరణలో పెట్టడానికి? వోట్లు సంపాయించడానికి అనేక వాగ్దానాలు చేయడం, ఎన్నికలు అయిపోగానే, ఏరు దాటింతరవాత తెప్ప తగలేసినట్లు, ఆ వాగ్దానాలను మరిచిపోయి చిత్తం వచ్చినట్లు ప్రవర్తించడం జరుగుతున్నది. లేకపోతే, నిజంగా కాంగ్రెస్‌కు తీర్మానాలను ఆచరణలో పెట్టాలన్న సంకల్పంవుంటే ఆంధ్రరాష్ట్రం పదిహేను ఏండ్లక్రిందటే వచ్చి వుండేది. మొదటిసారి కాంగ్రెస్ పార్లమెంటరీ రాజకీయాలలోకి దిగి మంత్రిపదవులు స్వీకరించినప్పుడే ఆంధ్రరాష్ట్రం ఏర్పడి వుండేది. ఆంధ్రరాష్ట్రం ఆంధ్రులకు సంబంధించిన సమస్య. తెలుగు మంత్రులు యీ విషయంలో పట్టుదల వహించి కృషిచేసి వున్నట్లయితే ఆంధ్రరాష్ట్రం సిద్ధించివుండేది. కాని పదవులమీద వున్న ఆసక్తి రాష్ట్రంమీద లేక పోయింది.

ఆంధ్రరాష్ట్ర ఉద్యమం కాంగ్రెస్‌కు లంకవేయబడటం మరో గమనించవలసిన విషయం. ఆంధ్ర మహాసభ అంటూ ఒకటి ప్రత్యేకంగా ఉన్నా యీ నాయకులంతా కాంగ్రెస్‌వాదులే కావటంచేత వీరు ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి న్యాయం చేకూర్చలేక పోయినారు. అటు కాంగ్రెస్ డిసిప్లిన్ వీరి స్వతంత్ర చర్యలకు అడ్డం వస్తున్నది. అందువల్ల యీ ఉద్యమం ఎప్పటికప్పుడు దెబ్బ తింటున్నది. కాంగ్రెస్ కావాలా లేక రాష్ట్రం కావాలా అనేది అసలు సమస్య. ముందు దీనిని నిర్ణయించుకోవాలి. యీనాడు ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పడటానికి ఏవిధమైన ఆటంకాలు లేవని, ఆంధ్ర, తమిళ, కన్నడ రాష్ట్రాల వారు ఒక అభిప్రాయానికి వస్తే రాష్ట్రం ఏర్పరుస్తామని కేంద్రప్రభుత్వంవారు అంటున్నారు. మద్రాసుశాసనసభలో వీరుముగ్గురూ ప్రతినిధులే. వీరితోకల శాసనసభ భాషాప్రయుక్త రాష్ట్ర విభజన తీర్మానం చేసింది. ఈ తీర్మానాన్ని ఎంతవరకూ ఆచరణలో పెట్టారు? దీని గతి ఏమైనట్లు?

సరిహద్దుల విషయంలో కొన్ని వివాదాలున్నవి. మద్రాసు విషయంలో పేచీ వున్నది. న్యాయంగా మద్రాసునగరం ఏ ఒకరి సొంత సొత్తూ కాదు. ఆ నగరంయొక్క పాత చరిత్రంతా తిరగవేయడం వృథాకాలయాపన. ఆ నగరం అందరి ఉమ్మడిసొత్తూ ఆంధ్రులడబ్బు, తమిళులడబ్బు, కన్నడుల డబ్బుతో ఆ నగరం ఇంతటి ఉన్నతస్థితికి వచ్చింది. ఇప్పుడు ఎవరు ఖర్చుచేసిన డబ్బు వాళ్లు తిరిగి తీసుకోవడం అనేది సాధ్యమయ్యే పనికాదు. ఆ నగరం ప్రత్యేక రాష్ట్రంగా వుండి కమిషనరు పరిపాలనకులోబడి వుండటం అందరికీ శ్రేయస్కరమైనది. అలా అయితేనే ఆ పట్టణంయొక్క ఔన్నత్యం నిలబడటానికిగాని, ప్రధాన కేంద్రంగావుండవలసిన కాస్మాపాలిటన్ వాతావరణం నిలవటానికిగాని అవకాశముంటుంది. కాని యీ విషయాన్ని తమిళులు అంగీకరించరు. మద్రాసు వారిదే నంటారు. తమిళులు మద్రాసు వారిదే నంటున్నారు కాబట్టి తెలుగు

ముఖ్యమంత్రి మద్రాసు వచ్చి, ఉద్యోగులంతా నిష్పాక్షికంగా వ్యవహరించవలసిందని ముచ్చటైన ప్రకటన చేశారు

పైనుండి క్రిందివరకూ పరిస్థితి అంతా యిదే తీరున ఉన్నది. రేపు ఢిల్లీలో కాంగ్రెస్ మహాసభ జరగబోయే ప్రదేశాన్ని పండిత నెహ్రూ స్వయంగా వెళ్ళి పరిశీలించారనీ అక్కడ కావలసిన మరమ్మత్తులకూ, కట్టడాలకూ కేంద్ర-పబ్లిక్ వర్క్సు శాఖ నియోగించ బడిందనీ, తెలుస్తున్నది. ఇక కాంగ్రెస్ పార్టీకీ, ప్రభుత్వానికీ ఉన్న తేడాను ఎవరు ఎక్కడ సరిగా పాటిస్తున్నట్లు? ఇక ప్రభుత్వ - అధిష్ఠాన వర్గాలవారే యిలా ప్రవర్తిస్తూంటే యిక తక్కిన తాబేదార్లకు క్రమశిక్షణ, నిష్పాక్షికత్వం, ఎలా అలవడతాయి?

కాంగ్రెస్‌లోని కల్మషాన్నంతా కడిగివేసి, దానికొక కొత్త కాంతి ఉత్తేజం, ఆదర్శం, సేవానిరతి, యిలాటివెన్నో చేకూర్చడానికి నడుం కట్టిన పండిత నెహ్రూ చివరకు పెత్తందార్లను, స్వప్రయోజనపరుల కూటాలను మరింత బలవత్తరం చెయ్యడంలోనే కృతకృత్యులైనారు. ప్రతి రాష్ట్రంలోనూ కాంగ్రెస్ సంస్థ పాలనాయంత్రం ఇదివరకున్న వారి చేతుల్లోనే ఇపుడూ ఉంది. వాళ్లే ఎన్నికల బందోబస్తులన్నీ చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వాలు వీరి కైవసంలోనే ఉన్నాయి. అటు కాంగ్రెస్ సంస్థకు కార్యదర్శిగా ఉంటూన్న శ్రీ కళావారిని పండిత నెహ్రూ తొలగించారు. ఈ తొలగింపులో యిమిడిఉన్న సిద్ధాంతం ఏమిటి? వెనువెంటనే ఆయన మద్రాసు మంత్రివర్గంలో చోటు చేసుకుని కూచున్నారు. ఇటువంటి "నాలుగు స్తంభాలాట" వల్ల నెహ్రూ సంతృప్తి పడితే పడవచ్చుగాని, అంతమాత్రాన ప్రజలువచ్చి కాంగ్రెసును అమాంతంగా కౌగలించుకోరు. తప్పుచేసిన ముద్గల్ పిచ్చుకపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించారు, సరే కాని ఉత్తర ప్రదేశ్ చక్కెర మిల్లు యజమానుల వద్దనుండి బాహాటంగా "కాంగ్రెస్ చందా" వసూలు చేస్తున్న శ్రీ గోవింద వల్లభపంత్ మొదలయిన వారి మాటేమిటి? నెహ్రూ కూడా యీ కలాపాన్ని సమర్థించడం గమనించతగ్గది.

ఆమధ్య ఏదో సందర్భంలో ప్రసంగిస్తూ, పండిత నెహ్రూ - కమ్యూనిస్టుల సిద్ధాంతాలనూ, ఆదర్శాలనూ తాను అంగీకరించకపోయినా, వారిలోని కార్యోత్సాహాన్నీ, క్రమ శిక్షణనూ, స్వార్థత్యాగాన్నీ, మెచ్చుకోవలసి ఉంటుందని అన్నాడు. మంచిదో - చెడ్డదో, కమ్యూనిస్టుల కొక ఆదర్శం ఉంది: భవిష్యత్తులో ఒక విశ్వాసం ఉంది. నేటి కాంగ్రెస్‌వారికి ఉన్న ఆదర్శం ఏమిటి? దేశకోసం వాళ్లు ఉత్సాహవంతులై, ఉత్తేజితులై స్వార్థత్యాగంతో పని చెయ్యవలసి ఉంటుంది? వాళ్ళంతా నేడు వర్తకం చెయ్యడంలో, పర్మిట్లు సంపాదించడంలో, ఆశ్రితులకూ, బంధువులకూ ఉద్యోగాలు వెదికి పెట్టడంలో నిమగ్నులై ఉన్నారు. ఉన్నతమైన ఆదర్శాలూ, వాటి ననుసరించిన భవిష్యత్తులో విశ్వాసమూ, యీ రెండూ లేనిదే ఎవరైనా ఉత్సాహమూ, త్యాగనిరతీ ప్రదర్శించగల్గుతారని నెహ్రూ అనుకుని ఉండడు. కాని, తను అటువంటిది సంభవమని నమ్ముతున్నట్లుగానే ప్రవచించి ప్రవర్తిస్తున్నాడు.

### అక్టోబరు2 లోపున రాష్ట్రం ఏర్పడకపోతే

# ఆంధ్రుల కర్తవ్యం

ఎ. ఎల్. నరసింహారావు

వెనకబడిపోయిన ఆంధ్రరాష్ట్ర సమస్య స్వామి సీతారాం ప్రాయోపవేశంతో తిరిగి ప్రాధాన్యానికి వచ్చింది. ఆంధ్రుల దృష్టి అంతా యీనాడు యీ సమస్యపై కేంద్రీకరించబడింది. భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సూత్రాన్ని కాంగ్రెస్ ఏనాడో అంగీకరించింది. కాని దురదృష్టవశాత్తూ కాంగ్రెస్‌కు తీర్మానాలు చేయడంలో వున్న ఆసక్తి, శ్రద్ధ, పట్టుదల వాటిని ఆచరణలో పెట్టడంలో లేదు. ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెస్ అనేక వాగ్దానాలు చేసింది. దేనిని ఆచరణలో పెట్టింది కనక రాష్ట్ర విభజనను ఆచరణలో పెట్టడానికి? వోట్లు సంపాయించడానికి అనేక వాగ్దానాలు చేయడం, ఎన్నికలు అయిపోగానే, ఏరు దాటించిన తరవాత తెప్ప తగలేసినట్లు, ఆ వాగ్దానాలను మరిచిపోయి చిత్తం వచ్చినట్లు ప్రవర్తించడం జరుగుతున్నది. లేకపోతే, నిజంగా కాంగ్రెస్‌కు తీర్మానాలను ఆచరణలో పెట్టాలన్న సంకల్పంవుంటే ఆంధ్రరాష్ట్రం పదిహేను ఏండ్లక్రిందటే వచ్చి వుండేది. మొదటిసారి కాంగ్రెస్ పార్లమెంటరీ రాజకీయాలలోకి దిగి మంత్రిపదవులు స్వీకరించినప్పుడే ఆంధ్రరాష్ట్రం ఏర్పడి వుండేది. ఆంధ్రరాష్ట్రం ఆంధ్రులకు సంబంధించిన సమస్య. తెలుగు మంత్రులు యీ విషయంలో పట్టుదల వహించి కృషిచేసి వున్నట్లయితే ఆంధ్రరాష్ట్రం సిద్ధించివుండేది. కాని పదవులమీద వున్న ఆసక్తి రాష్ట్రంమీద లేక పోయింది.

ఆంధ్రరాష్ట్ర ఉద్యమం కాంగ్రెస్‌కు లంకె వేయబడటం మరో గమనించ వలసిన విషయం. ఆంధ్ర మహాసభ అంటూ ఒకటి ప్రత్యేకంగా ఉన్నా యీ నాయకులంతా కాంగ్రెస్‌వాదులే కావటంచేత వీరు ఆంధ్ర రాష్ట్ర ఉద్యమానికి న్యాయం చేకూర్చలేక పోయినారు. అటు కాంగ్రెస్ డిసిప్లిన్ వీరి స్వతంత్ర చర్యలకు అడ్డం వస్తున్నది. అందువల్ల యీ ఉద్యమం ఎప్పటికప్పుడు దెబ్బ తింటున్నది. కాంగ్రెస్ కావాలా లేక రాష్ట్రం కావాలా అనేది అసలు సమస్య. ముందు దీనిని నిర్ణయించుకోవాలి. యీనాడు ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పడటానికి ఏవిధమైన ఆటంకం లేదనీ, ఆంధ్ర, తమిళ, కన్నడ రాష్ట్రాల వారు ఒక అభిప్రాయానికి వస్తే రాష్ట్రం ఏర్పరుస్తామని కేంద్రప్రభుత్వంవారు అంటున్నారు. మద్రాసుశాసనసభలో వీరు ముగ్గురూ ప్రతినిధులే. వీరితో కలసి శాసనసభ భాషాప్రయుక్త రాష్ట్ర విభజన తీర్మానం చేసింది. ఈ తీర్మానాన్ని ఎంతవరకూ ఆచరణలో పెట్టారు? దీని గతి ఏమైనట్లు?

సరిహద్దుల విషయంలో కొన్ని వివాదాలున్నవి. మద్రాసు విషయంలో పేచీ వున్నది. న్యాయంగా మద్రాసునగరం ఏ ఒకరి సొంత సొత్తూ కాదు. ఆ నగరంయొక్క పాత చరిత్రంతా తిరగవేయడం వృథా కాలయాపన. ఆ నగరం అందరి ఉమ్మడిసొత్తూ. ఆంధ్రులడబ్బు, తమిళులడబ్బు, కన్నడుల డబ్బుతో ఆ నగరం ఇంతటి ఉన్నతస్థితికి వచ్చింది. ఇప్పుడు ఎవరు ఖర్చుచేసిన డబ్బు వాళ్లు తిరిగి తీసుకోవడం అనేది సాధ్యమయ్యే పనికాదు. ఆ నగరం ప్రత్యేక రాష్ట్రంగా వుండి కమిషనరు పరిపాలనకులోబడి వుండటం అందరికీ శ్రేయస్కరమైనది. అలా అయితేనే ఆ పట్టణంయొక్క ఔన్నత్యం నిలబడటానికిగాని, ప్రధాన కేంద్రంలోవుండవలసిన కాస్మాపాలిటన్ వాతావరణం నిలవటానికిగాని అవకాశముంటుంది. కాని యీ విషయాన్ని తమిళులు అంగీకరించరు. మద్రాసు వారిదే నంటారు. తమిళులు మద్రాసు వారిదే నంటున్నారు కాబట్టి తెలుగు

ఆందోళనవల్ల కొందరు వోట్లు పోలుచేయక పోవచ్చు. కాని అభ్యర్థులుగా నిలబడటానికి అనేకమంది స్వార్థపరులు వర్షాకాలంలోని ముత్యపు చిప్పల మాదిరిగా ఎదురు చూస్తున్నారు. ఎన్నికలలో నిలచే అభ్యర్థులుండడం చేత వాళ్లు ఏవో కొన్ని ఓట్లు పోలింగు చేయించుకోక మానరు. వారు విజయంపొంది ప్రజా ప్రతినిధులుగా చలామణి అవుతారు. ఇది ఆంధ్రులంతా ఆలోచించవలసిన విషయం. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోకపోతే రాష్ట్రం కేవలం [illegible] అవుతుంది.

ఈ కార్యక్రమాన్ని ఆచరించేందుకు ఎంతమంది నాయకులు సిద్ధంగావున్నారు? రాష్ట్ర కాంగ్రెసు సంఘం నెహ్రూ కోరిన ప్రకారం తీర్మానించింది. కాని నెహ్రూ రాష్ట్ర నిర్మాణాన్ని వాయిదా వేస్తే వీరు ఏం చేయబోతున్నారు? ప్రకాశంగారి పార్టీ ఏం చేయబోతున్నది? వీరంతా రాష్ట్రంకోసం తమ [illegible] రాజకీయాలకు స్వస్తి చెప్పడానికి సిద్ధంగా వున్నారా? పార్టీ రాజకీయాలతో నిమిత్తం లేకుండా రాష్ట్రంకోసం కృషిచేయడానికి వీరు సిద్ధంగా వున్నారా? వీరికిది పరీక్షా సమయం. ఈ పరీక్షలో వీరికి సున్నా మార్కులు వస్తే అంటే వీరు యీ పరీక్షకు నిలవలేకపోతే ఆంధ్రులంతా యీ నాయకులకు ఉచిత స్థానాన్ని చూపించాలి. ఆంధ్ర రాష్ట్రమే లక్ష్యంగాగల స్వతంత్రులు బయటపడాలి. స్వామీ సీతారాంగారు తమ దృష్టిని యీ విషయంపై కేంద్రీకరిస్తారని ఆశిస్తున్నాను. వారు [illegible] పై కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికి కృషిచేస్తే యీనాడు ఆంధ్ర రాజకీయాలలో వున్న కల్మష వాతావరణమంతా పవిత్రమైపోతుంది. వారు ఆంధ్రులకు మహత్తరమైన సేవచేసినవారవుతారు. దేశానికి నూతన మార్గాన్ని చూపించిన గౌరవం లభిస్తుంది.

### వస్తున్న ఎన్నికలలో అభ్యర్థుల అర్హతలు

# ఆంధ్ర పూజారుల దయాదాక్షిణ్యాలు

పి. రామబ్రహ్మం

కేంద్ర పార్లమెంటుకు, మద్రాసు స్టేటు అసెంబ్లీకి ఎన్నుకొనుటకు అర్హతలు గల అభ్యర్థులకు కాంగ్రెసు టిక్కెట్లు ఏ సూత్రాల ననుసరించి ఇవ్వాలో పండిత నెహ్రూ కొన్ని సూచనలు చేశారు. అందులో ఒకటి, కాంగ్రెస్ ప్రదేశ కమిటీలకు ఎట్టి దరఖాస్తులు పెట్టుకొనకుండా వున్న కొంతమంది నిక్కచ్చి అయిన వ్యక్తులను ప్రదేశ కమిటీ వారు ఆహ్వానించి కాంగ్రెసు అభ్యర్థులుగా వుండమని కోరటం. కాంగ్రెసులో ప్రస్తుతం వున్న కులతత్వ రాజకీయాలు పుష్కలం. కాని కొంతమంది పెద్దలు [illegible]గా వున్నమాట నిజమే. అయితే లోగడ మనకు అసెంబ్లీ మెంబర్లుగా వున్న వారిలో చాలామంది, మరికొంతమంది ప్రస్తుత కాంగ్రెసు వర్గీయులు తిరిగి దరఖాస్తులు పెట్టారు

ఈ దరఖాస్తుదారుల అర్హతానర్హతలను పరీక్షచేసి హైకమాండుకు పేర్లు పంపించుటకు ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ జిల్లాలలో పర్యటన ప్రారంభించింది. ఈ పరీక్షకులలో ముఖ్యులు సంజీవరెడ్డి, గోపాలరెడ్డి, అల్లూరి, ఆయా జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు. వీరంతా ఒకే వర్గమునకు చెందిన వారనే సంగతి మనం మరువరాదు. ఈ పరీక్ష చేసేవారి అర్హతలు, లెజిస్లేటివ్ అసెంబ్లీలోను, దిన పత్రికలలోనూ మారుమ్రోగాయి. అంటే వీరికివున్న యోగ్యతలుగల వ్యక్తులే తిరిగి మెంబర్లుగా ఎన్నుకోబడతారన్న మాట. కాబోతే

# ప్రజాపార్టీ భవితవ్యం

తిత్తి జనార్దనరావు

నెహ్రూ కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి అధినేత అయినప్పటినుంచి దేశంలోని రాజకీయ పార్టీలలో ఒక్కసారి పెద్ద పెట్టున దుమారం లేగింది. ముఖ్యంగా కాంగ్రెసు సంస్థనుండి విడిపోయి వేర్వేరు పార్టీలను లేవదీసిన వ్యక్తుల్లో కూడా కొంత మార్పు కనబడినట్లు తెలుస్తోంది. వారి ప్రకటనలు ముఖ్యంగా లేకపోయినప్పటికీ వారి పార్టీ నిలకడను గమనిస్తేంటే వ్యక్తుల్లోనే మార్పు రాబోతున్నట్లు కనబడుతోంది.

నెహ్రూ అధ్యక్షుడు కాగానే సోషలిస్టు నాయకుడు అశోకమెహతా తన హర్షాన్ని తెలిపాడు. ఎన్నికల్లో కాంగ్రెసుపార్టీ కొంతవరకు బలాన్ని చేపట్టగలదని నోస్యాం కూడా చెప్పాడు. కిద్వాయి, కృపలానీలు కూడా అదే అభిప్రాయంతో ఇంకోలా చెప్పారు. ఆ చెప్పడంలో కొంత కలవారు కూడా యిరికించారు. కార్యవర్గాన్ని మార్పుచేసినంత మాత్రాన కాంగ్రెసునే సంస్కరించటం కాజాలదు. ముఖ్యంగా రాష్ట్రసంఘాల్లో యిరుక్కున్న దుష్టశక్తుల్ని తొలగించటానికి ప్రయత్నం చెయ్యాల్సొంటుంది.

అదీ నిజమే! అన్ని ఆయా రాష్ట్రాల్లోని దుష్టశక్తుల వలననే యీనాడు కాంగ్రెసు సంస్థ ప్రజల అపరాధినాలు కారణమై పోయింది. ఆ కారణం వలననే ప్రజానాయకులను మనిషించు నేవాళ్లు కొందరు కాంగ్రెసు నుండి విడిపోయి ప్రజాపార్టీని స్థాపించుకున్నారు. కాంగ్రెసు కార్యక్రమంలోని ఒడుదుడుకులకంటే కాంగ్రెసులోని దుష్టశక్తులే ప్రజాపార్టీ నాయకుల వ్యతిరేకతకు కారణం.

ఇప్పటి ప్రజాపార్టీ నాయకులకు నెహ్రూకు కావలసినంత సన్నిహిత సంబంధము కలదు. కిద్వాయ్ కృపలానీలు నెహ్రూ నాయకత్వం కావాలని బాహాటంగానే చెబుతున్నారు. ఎన్నికల్లో నిజంగా ప్రజాపార్టీయే గెలిచినట్లయితే నెహ్రూనే ప్రధానిగా కోరుకుంటామని కిద్వాయి ప్రకటించాడు. అంటే నెహ్రూ పార్టీలకు, ముఠాలకు అతీతుడని కిద్వాయి

వ్యక్తిగతంగా నెహ్రూ నాయకత్వం పట్ల మోజును కనబరచినంత మాత్రాన తిరిగి ప్రజాపార్టీ కాంగ్రెసులో కలిసిపోతుందని అభిప్రాయపడటంలో ఆధారంలేదని ప్రకాశం తెలియచేశారు. ఏదైనా కాంగ్రెసును ఎన్నికల్లో ఓడించి తమపార్టీ వారికి అన్యాయం చేసిన కాంగ్రెసు పెద్దమనుష్యులకు బుద్ధిచెప్పాలనికూడా కొంతమంది ప్రజాపార్టీ నాయకులు ప్రకటనలు చేస్తున్నారు. దీనినిబట్టి పార్టీలమధ్య పోటీకంటే వ్యక్తులమధ్య తీవ్రమైన పోటీలు వచ్చి తీరుతాయని తెలుస్తోంది. ఆ పోటీలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా నిలిచి, అహింసా సిద్ధాంతాలకు కట్టుబడిన ప్రతిపక్ష వర్గాలతో విలువున్న ప్రదేశాల్లో ప్రజాపార్టీ చేతుల్ని కలపటానికి కూడా సిద్ధంగా వుంది.

కృపలానీ, ప్రకాశం, కిద్వాయి, కేలప్పన్, ఘోష్‌లు ఆయా ప్రచార కేంద్రాల్లోని అధిపతులు. ప్రజలకు ప్రజాపార్టీ గురించి తెలియక పోయినప్పటికీ పార్టీ నాయకులు మాత్రం చిరపరిచితులు. అందులోనూ ఎన్నికల ముందు అనేకమంది కొత్త పార్టీలు స్వప్రయోజనాల కోసం లేస్తుండటం సహజమే అన్న అభిప్రాయం ప్రజల్లో నాటుకునివుంది. అటువంటి దురభిప్రాయాన్ని పోగొట్టడానికి నాయకులు నడుంకట్టుకుని పత్రికల్లో వ్యాసాలు వేస్తున్నారు.

బెంగాల్‌లో పి. సి. ఘోష్‌కు కావలసినంత పలుకుబడి వున్నప్పటికీ ఎన్నికల్లో అక్కడ విజయం కలిగే అవకాశం లేనట్లు కనిపిస్తుంది. దానికి కారణం బెంగాల్‌లోని రాజకీయ వాతావరణంలో వచ్చిన మార్పే!

అరుణా ఆసఫాలీ స్థాపించిన విప్లవ సోష

లిస్టు పార్టీ తీవ్రవాదుల్లో గొప్ప చైతన్యాన్ని కలిగించింది. అది గాకుండా స్వర్గీయ శరత్ బోసు స్థాపించిన సోషలిస్టు, రిపబ్లికన్ పార్టీ, ఫార్వర్డ్ బ్లాక్ పార్టీ, విప్లవ కమ్యూనిస్టు పార్టీ ఎన్నికల్లో ఏకంగావటానికి సమాధానపడినట్లు కూడా తెలుస్తోంది. ఆ పార్టీల సమైక్యతని ప్రజలు ప్రోత్సాహిస్తున్నట్లు మొన్న జరిగిన కలకత్తా వుపఎన్నికల్లో శరత్ బోసు సతీమణి గెలవటమే గొప్ప నిదర్శనం! శ్యామ ప్రసాద్ పీపిల్సు పార్టీ, హిందూ మహాసభ రెండూ కలిసి ఎన్నికల్లో నిలబడుతున్నాయి. వీటిలో ఒకటికొకటి పోటీ చెయ్యకుండా కాంగ్రెసును ఓడించటానికే సిద్ధంగా వున్నాయని చెప్పటానికి ఆధారాల్లేవు. ఏమంటే, శ్యామప్రసాద్ పార్టీకీ, ఐక్య సోషలిస్టుపార్టీకి మధ్య కావలసినంత వైషమ్యం ఏర్పడ్డాని వుంది. తూర్పు బెంగాలు కాందిశీకులుంటోన్న ప్రదేశాలన్నీ శ్యామప్రసాద్ ముఖర్జీకి అండగా నిలబడగలవని తెలుస్తోంది. కాబట్టి బెంగాల్‌లో ప్రజాపార్టీ బలం గొప్పగా చెప్పుకోడానికి ఆస్కారం లేనట్లే కనిపిస్తోంది.

ఆంధ్ర దేశంలో ప్రకాశం మంచి పేరు పొందిన నాయకుడు. ప్రకాశం పేరుమీదనే ఎన్నికల్లో ప్రజాపార్టీకి ఓట్లు పడే అవకాశం వుంది. కాని ప్రకాశం అనుచరులకు ఓపిక తగ్గిపోయింది. చాలమంది ఇప్పటికే తప్పుకున్నారు. తీరా ఎన్నికల సమయం వచ్చేటప్పటికి ఎంతమంది తప్పుకుంటారో తెలీదు. జిల్లాకి ఇద్దరో ముగ్గురో చొప్పున రాష్ట్ర శాసనసభలో (ఒకవేళ ఆంధ్రరాష్ట్రం యేర్పడిన పక్షంలో) ప్రవేశించడానికి వీలుంటుంది. కేంద్రపార్లమెంటుకు ప్రజాపార్టీ అభ్యర్థులు ఆంధ్ర నుండి ఎవరూ లేనట్లే కనబడుతున్నది. ఒకవేళ వున్నప్పటికీ అట్టేనమ్మకం కలగటానికికూడా అవకాశంలేదు. ఆంధ్రలో రంగాపార్టీ యిటు కాంగ్రెసుకూ అటు ప్రజాపార్టీకి ఎదురునిలిచి ఓడించటానికి నిశ్చయించుకున్నట్లు తెలుస్తుంది. ఇక తమిళ ప్రాంతంలోని జస్టిస్‌పార్టీ, హెచ్. డి. రాజా రిపబ్లికన్ పార్టీ, కమ్యూనిస్టు పార్టీలు విడివిడిగా తమ అభ్యర్థులను నిలబెట్టబోతున్నట్లు ప్రకటించాయి. ఇవన్నీ కాంగ్రెసుతోబాటు ప్రకాశం ప్రజాపార్టీని ఎదిరిస్తాయి. కాబట్టి ఆంధ్రలో గాని, తమిళ ప్రాంతంలోగాని ప్రజాపార్టీ మెజారిటీతో ప్రభుత్వాన్నిగాని సోషలిస్టుల సహాయంతో మిశ్రమ మంత్రివర్గాన్నిగాని స్థాపించటం కలలోని మాట.

ఉత్తర ప్రదేశ్‌లోకూడా అంతే. కిద్వాయ్ కృపలానీలు ఎంత ప్రయత్నించినప్పటికీ ప్రజాపార్టీ మెజారిటీను సంపాదించలేదు. కాని సోషలిస్టులతో చెయ్యి కలపడంవలన మెజారిటీని సంపాదించి మిశ్రమ మంత్రివర్గం ఏర్పాటు చేయడానికి అవకాశముంది. బీహారులో ప్రజాపార్టీ, సోషలిస్టులుకలసి ప్రభుత్వాన్ని స్థాపించడానికి చాల అవకాశంవున్నట్లు మొన్న పాట్నాలో జయప్రకాశ్ నారాయణ చేసిన ప్రకటనలవలన తెలుస్తోంది. బొంబాయి అస్సాం రాష్ట్రాల్లో [illegible]త్రిగా ప్రజాపార్టీకి బలం లేదనే చెప్పాలి. ఇక సంస్థాన రాష్ట్రాల్లో అడగనవసరంలేదు. మధ్యప్రదేశ్‌లో కాంగ్రెసు ప్రజాపార్టీ పోటీ మధ్య హిందూమహాసభ పైకి రావడానికి వీలుంది.

అసలు దేశంలో ప్రజాపార్టీగురించి ఆలోచిస్తే ఏమంత జయాన్ని పొందగలదనే నమ్మకం లేదు. కేంద్ర పార్లమెంటులో ప్రభుత్వ ప్రతిపక్షంగా వ్యవహరించటానికి కూడా ప్రజాపార్టీకి అవకాశం కనబడటం లేదని రాజకీయవేత్తలు భావిస్తున్నారు. మొన్న సోషలిస్టులతో చేసుకున్న ఒప్పందం వలన ఒకటి రెండు రాష్ట్రాల్లో మిశ్రమ మంత్రివర్గాలను స్థాపించగలిగినా [illegible]. తక్కిన రాష్ట్రాల్లో మంత్రివర్గం కాదు గదా ప్రతిపక్షవర్గానికి కూడా అవకాశంవుండదని గట్టిగా కొందరు చెబుతున్నారు. ఎన్నికల తర్వాత బుద్ధి మార్చుకుంటే ప్రజాపార్టీ కాంగ్రెసుతో కలిసి అన్ని రాష్ట్రాల్లోనూ మిశ్రమ మంత్రివర్గాలను స్థాపించ వచ్చునని అభిప్రాయాన్ని ఇటీవల బాధ్యత గలిగిన ప్రజాపార్టీ నాయకుడు వెలిబుచ్చాడు. ప్రభుత్వ స్థాపనే ప్రజాపార్టీ యొక్క లక్ష్యం అయితే ఆ పార్టీ తప్పకుండా ఎన్నికలు గురించే పుట్టి అధికారం కోసం కలలు కంటున్నదని మాత్రం బహిరంగంగా ప్రచారం చెయ్యటం మంచిది.

# స్వామీ సీతారామ్‌గారికి బహిరంగ లేఖ

పూజ్య స్వామీజీ,

తాము తమ బృందంతో "సత్వర ఆంధ్ర రాష్ట్ర సిద్ధి"కై పూనిన ప్రాయోపవేశ దీక్ష విరమణకు మా సంతోషము. అనేక సంవత్సరముల నుండి, ఆంధ్రులు కలలుగంటున్న "ఆంధ్ర రాష్ట్రావతరణ"కై తాము ప్రతినబూనడం ఎంతయూ ముదావహము. పెక్కు సమస్యలతో ఆంధ్రులకు జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలు ఉపేక్షింప జాలనివి, భరింపజాలనివి.

మనకు స్వాతంత్ర్యము సిద్ధించిన, పిమ్మట తీరగల సామాన్య సమస్యలు ఇంకనూ తీరలేదు. సామాన్య మానవుని జీవితాలు కడగండ్ల పాలయినవి. ఇన్ని తీరకపోగా, మరెన్నో అదనపు సమస్యలు మనలను ఆవరించాయి. వీటంతటికీ కారణం, చాలామటుకు - మన ఆంధ్ర నాయకుల చిత్త ప్రవృత్తులు. వీరి ముఠా రాజకీయ తత్వాలు; స్వలాభాపేక్షలు; పదవీ వ్యామోహాలు, వారిని ఇంకనూ - మానసికంగానూ, నైతికంగానూ దుర్బలురుగా చేశాయి. ఆంధ్రులకు జరుగుతున్న అనేక అన్యాయాలను (అనగా ప్రాజెక్టులు, ఉద్యోగాలు మొదలగు విషయాలలో) గురించి మన తెలుగు ఎం. ఎల్. ఏ., ల మంత్రుల ధోరణి చూస్తుంటే - వారి సంకుచిత స్వభావాలు, స్వలాభాపేక్షలు, బాధ్యతారాహిత్యమైన ప్రసంగాలు అనుదినమూ మనలను కలవరపెడుతూ, మన సమస్యలన్నీ ఎప్పుడు తీరుతాయో, వారిలో ఎప్పుడు పరివర్తన వస్తుందా అనిపిస్తుంది. ప్రజలచే ఎన్నుకోబడిన వీరంతా నేడు ప్రజలకు ఏం చేస్తున్నారు? ముఠా రాజకీయాల కోసం, పర్మిట్ల కోసం, వారివారి బంధుశ్రేణికి, స్నేహిత బృందాలకు సహాయాల కొరకేనా వీరు ఎం. ఎల్. ఏ. లైంది, మంత్రులైంది? ఎక్కడ చూచినా, ఏమూల చూచినా వారి వింత ప్రవర్తనలే కళ్లకు కట్టినట్లుగా గోచరిస్తున్నాయి.

సామాన్య మానవునకు, దీనకు - తినటానికి తిండీ, కట్టుకోవడానికి గుడ్డ, ఉండటానికి వసతీ లేక అల్లాడిపోతుంటే, చాలీ చాలని జీతాలతో రాత్రింబవళ్లూ కష్టించినా తృప్తిపడని యజమానుల దౌర్జన్యాలకూ, ఆగ్రహాలకూ గురి అవుతూ తాను సంపాదించిన దానితో నెలకు ఇరవై రోజులైనా గడుపుటకు అవకాశాలు లేకుండా, అమితంగా పెరిగిపోతున్న వస్తువుల విపరీత ధరలకు లోనౌతూ, అన్నివిధాలా మలమలమాడిపోతూంటే, దుర్భర పన్నుల భారంతో కృంగిపోతూంటే మన నాయకులైన వారంతా ఇవన్నీ చూస్తూ, మేము చేసేదంతా మీ మేలు కొరకేనని ఏవో నాలుగు మాటలు చెపుతూ, వినోదాలతో, విందులతో, ఖులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, ఆనందిస్తున్నారు. వారి స్వలాభాల కోసం ప్రాకులాడుతున్నారు. ఈ దీన జనుల ఆర్తనాదాలు, కరుడు గట్టిన వారి సంకుచిత హృదయాలకు ఎలా అర్థమవుతయి? వీరేనా ప్రజాసేవ, దేశసేవ చేసేది? నిజంగా వీరు ఏం చేస్తున్నారు? ప్రజాసేవ అంటే ఏమిటో, దేశసేవ అంటే ఏమిటో మన నాయకులైన వారందరికీ బాగా తెలుసునా? తెలియకేం? ఉడ్ లాండ్స్, పార్క్ లాండ్స్, స్పెన్సర్, బసోటా, అజంతా, ఎవరెస్టు మొదలైన హోటళ్లలో మకాములు చేయడం, విలాసాలు, వినోదాలు, విందులు గుడవడం. ముఠా రాజకీయ తత్వాలను పెంపొందింప చేయడం, ఇదీ దేశసేవకు, ప్రజాసేవకూ వీరి నిర్వచనం. లేదా, ఎక్కడకైనా వచ్చినప్పుడు రెండు లెక్చర్లు ఊకదంపుడుగా దంచటం, స్వలాభపరులు తమ ప్రతిఫలాల కొరకు హంగామా చేసే టీపార్టీ, డిన్నరు పార్టీలకు హాజరు కావడం ఇట్టివి వారి దృష్టిలో సేవాభావాలు.

సమాజంలో తనతో సమానంగా పుట్టి పెరుగుతున్న దీనుల ఆక్రందనలను పరికించి, ఊరూరా వెళ్ళి, వారు నిజంగా ఎటువంటి అన్యాయాలకు గురి అవుతున్నారో, వారికేమైనా ఇతర బాధలు సంప్రాప్తించుచున్నవేమో గమనించి. వ్యక్తిగత ద్వేషాలకు తావీయక నిష్కల్మష హృదయంతో చేతనైన తన శారీరక, మానసిక, వాక్ సహా

యం ద్వారా ఆ దీనుల కష్టాలను తొలగించుటకు మహోన్నత నిర్మాణ కార్యక్రమం కొనసాగించే టట్లు ఐక్యతా భావంతో సహకరించేందుకు దీక్షా కృషి సలపాలి. ఈ విధంగా సాధ్యమై నంతవరకు హృదయ పూర్వకంగా తోడ్పడ మనేదే నిజమైన మానవసేవ, దేశసేవ, లోక సేవ అని మన మహా నాయకుల, బుధుల నిర్వచనములు గదా?

ఈనాడు నాయకులుగా చెప్పుకోతగ్గవారు వ్రేళ్ళమీద లెక్కపెట్టేవారు కూడ లభించు తారో లేదో? ఇప్పటి పరిస్థితులలో ఎవరు దేశ సేవ కొరకని ఎక్కువగా తయారవు తున్నారు? తనకు తినటానికి తిండి, కట్టటానికి గుడ్డ, కొన్ని వసతులు గలవారే నేడు నాయ కులుగా రాగలుగుతున్నారు. వారంతా "సామాన్య సమస్యలను మేంతీర్చుతాం. మానవ సేవ, దేశసేవ మేం చేస్తాం .."అని కంకణాలు కట్టుకొని, త్యాగాలుచేసి, జైళ్ళకు వెళ్ళి, నేడు ఎం. ఎల్. ఏ. లుగను, మంత్రులుగను, ప్రజా నాయకులుగను మారి వీరు చేస్తున్న అసభ్య స్వలాభ సేవలనేకదా, నేడు మనం చూస్తు న్నది? ఇదేనా మానవనీతి? తోటి సోదరులకు భరింపరాని దుఃఖాన్ని కలుగచేస్తున్న స్వలాభ పరులుగా తయారుకావడం మన దురదృష్టం.

నిజమైన మానవసేవ, దేశసేవ, చేయగల సత్తా సామాన్య మానవులలో ఎంతో మందిలో వుంది. కాని, వారిని దైనందిన సమస్యలే అణచి వేస్తున్నాయి. కుటుంబ రక్షణ, పోషణ మొదలగు సమస్యలతోనే, కృంగిపోతున్న వీరంతా దేశంకోసం ఏమిచేయగలరు? తనకు లభించినదానితో తృప్తి పడటం, తన చేతనైతే తోటిసోదరమానవులకుసహాయపడటం, పరమ ధర్మంగా ఎంచుతాడు. వాస్తవికత కల ప్రతి సామాన్యుడు అభ్యుదయ మార్గంలో సహజ మైన జీవితాన్ని గడపాలని వాంఛించుతాడు. అట్టి సహజ జీవనంలోనే, సత్యము-ధర్మము, నీతి-న్యాయము, జాలి-ప్రేమ అన్నీ ఇమిడి ఉన్నాయని విదితమే గదా? తన నిత్య సమస్య లనే ఎదుర్కొనజాలని సామాన్యుడు ప్రజా సేవ, దేశసేవ ఎట్లు చేయగలడు? అనేక నైతిక బాధలతో ఏమీ చేయలేక మరుగున పడిపోతు న్నాడు. వీరి కష్టాలు ఇపుడు నాయకులకు ఎట్లా అర్థమవుతాయి? "వీరి సమస్యలు ఎలా తీరు తాయి?" అనే చింతన- నేటి నాయకుల మను సులనే వారి హృదయాలలో రవ్వంతైనా ఉండేనా, గుండెలు పిల్చుకుని చూచుకో మనండి? వీరికే విశాలహృదయమనేది ఉంటే, నేటి దుర్భర దారిద్ర్యాన్నుండి గరి అవుతున్న వారినందరినీ చూస్తూ, ఈ విధంగా కళ్లు మూసు కుని ప్రవర్తిస్తారా? వీరిలో నేడు రావలసిన మార్పు ఏమిటి?

నేటి నాయకుల హృదయాలలో జీర్ణించుకు పోయిన సంకుచిత కులతత్వ వాదాలు. స్వార్థ పరాయణత, మూకటిప్రేళ్ళతో తెగి సంతాపం చల్లై పోవాలి. నిజమైన మానవసేవకు అర్థం చేసుకుని, ప్రజలకు మనసారా తనకు చేతనైన సహాయాన్ని చేసితీరాలి. ఆయినా, పల్లెపల్లె నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించటానికి కంకణబద్ధులు కావాలి. స్వార్థాన్ని విడనాడి నీతి, న్యాయం కొరకు పాటుపడాలి. సమా జంలో జరుగుతున్న వర్గవైషమ్యాలను రూపు మాపుటకు ప్రతిన బూనాలి. అక్రమాన్ని పారద్రోలి, సత్యాన్ని - ధర్మాన్ని నెలకొల్పాలి. ఇవన్నీ మనసారా త్యాగబుద్ధితో చేసేవారే నిజమైన ప్రజానాయకులు. వారే పూజనీయులు. ఎన్నికలవస్తే తమకు దిగ్విజయం చేకూరునట్లు ప్రజలే హృదయపూర్వకంగాసహాయపడతారు.

కనుక ఓ మహానీయా, సంకుచిత స్వభా వాలుగల నాయకుల హృదయాలలోపరివర్తనం తీసుకుని వచ్చేందుకు మీరు దీక్ష బూనండి. నిజ మైన ప్రజా సేవకై ప్రతిన బూనండి. అందుకు మీతో పాటు, కొన్ని వేల మంది యువకులు, స్త్రీలు, ఉత్సాహపరులు, మీతో మనసారా సహకరిస్తారు. అపుడే సహజమైన ఆంధ్ర రాష్ట్రం దానంతటదే సిద్ధిస్తుంది. అప్పుడే దాని ఫలితాలను, ఆశయాలను నెరవేర్చకలుగుతాము. మనకు లభించే రాష్ట్రంకూడ ఆదర్శప్రాయమై శోభను గూరుస్తుంది.

ఆంధ్ర నాయకులు పదవీ వ్యామోహంలో పడి, వారి బాధ్యతలనే పూర్తిగా మరచి పోయారు. నేటి ఆంధ్ర దేశ రాజకీయం ఒక మురికి గుంట. ఇట్టిపరిస్థితులలో ఆంధ్రరాష్ట్రం

వస్తే ఏం జరుగుతుంది? ఎవరికి లాభం? చిన్న పదవులలో నున్నవారికి పెద్ద పదవులు, సామాన్యధనికుడు గొప్పధనికుడుగాను, లక్షాధికారి ఇంకా కోటీశ్వరుడుగాను అవుతారు. సామాన్యుడు, బీద కూడ ఇంకా క్షీణ దశలోకి పతనమైపోక తప్పదు. వాళ్ల సమస్యలు మటుమాయమై పోతవి. న్యాయం, సత్యం, ధర్మం, జరుగుతుందనడం కలలోని వార్తగా రూపొందగుతుంది. కుల తత్వాలు తీవ్రంగా విజృంభిస్తాయి. పదవీ వ్యామోహం మరింతగా పెచ్చు పెరిగి పోతుంది. ఇక ముఠా రాజకీయాలు ఉండనే ఉన్నాయి. అంతర్యుద్ధం తప్పదు. గాఢాంధకారంలో కూడిన పెను తుఫాను చెలరేగుతుంది. వర్గ వైషమ్యాలు, స్వార్థపరత్వం, వెర్రి తలలు వేయక తప్పదు. బలం గలవానిది, నోరు గల వానిది రాజ్యం అవుతుంది.

ఇంతటి దుర్గంధంలో ఆంధ్ర దేశం కుళ్లి పోతూంటే, మీరు ఆంధ్ర రాష్ట్రమో అని, ప్రాయోపవేశమనీ, సత్యాగ్రహమనీ నెహ్రూ వంటి నాయకులు సరైన సమాధానాలు ఇవ్వలేదనీ విమర్శనలు చేస్తూ, ఆంధ్రరాష్ట్రం కొరకు ఎందుకు ఉవ్విళ్ళూరుతున్నారో, గ్రాహ్యం కాకుండా వుంది. మన నాయకులలో అనేక సంకుచిత భావాలుగల కుళ్లును పెట్టుకొని "వారట్లన్నారు. వీరట్లన్నారు." అని గోషపడితే మాత్రం ప్రయోజనం? ఇట్టి అవినీతికరమైన హేయ భావాలుగల వ్యక్తులుండగా ఎవరైనా ఏమైనా అంటారు. కనుక యిటువంటి మాలిన్యమైన ఆంధ్రనాయకుల మనోప్రవృత్తులను పదవీ వ్యామోహాన్ని, స్వాభిమానేచ్ఛతో కూడిన కులమత వైషమ్యాలను పారద్రోలి, అంధకారంలో మునిగియున్న వారికందరకు జ్ఞానోదయం, వివేకోదయం కలుగేటట్లు, వారిని నిర్మల నిష్కల్మష హృదయ వర్తనులుగా, నిజమైన మానవ సేవ దేశసేవ చేయగల సమర్థులుగా మార్చగలిగేటందుకు, కలుషితమైన వారి హృదయాలను కల్మషరహితంగా సత్ప్రవర్తకులుగా తయారయేటందుకు ప్రచారం చేయండి. మీతో పాటు దహించుకుపోయే అమాయక హృదయులంతా మీరు చేస్తున్న కృషికి తోడ్పడతారు.

ఇట్టి నిజమైన పవిత్ర ఆశయాల కొరకు పల్లె పల్లె గ్రామగ్రామంలోను ప్రతి పట్టణంలో నుండి మీరు ఆశించిన సహాయం లభిస్తుంది. మీ మేధాశక్తిని, మీ అవిరళ కృషిని ఇట్టి ఆదర్శాల కొరకు ధారపోయండి. అదే మానవసేవ, దేశసేవగా రూపొందుతుంది. ఇదంతా సిద్ధిస్తే, మనకు తప్పక ఆంధ్రరాష్ట్రం వచ్చితీరుతుంది. మన సమస్యలను తేలికగా పరిష్కారం చేసుకో గలుగుతాము. ఆ నిజమైన ఆంధ్ర రాష్ట్రాన్ని కన్నులారా గాంచి ప్రతి ఆంధ్రుడు ధన్యుడౌతాడు. అపుడు దాని రక్షణకొరకై తన ప్రాణాలనైనా హృదయపూర్వకంగా ధారపోస్తాడు.

ఇటువంటి పవిత్ర ఆశయ సిద్ధికొరకు ప్రాణాలనైనా త్యాగం చేద్దాం. మూర్ఖపు హృదయాల పరివర్తనం కొరకు, దహించుకుపోయే, ఆత్మలను బలిదానం చేద్దాం. అప్పటికైనా వారిలో మార్పు వస్తుందేమో? గర్భ దరిద్రుడు, ఎన్ని విషమసమస్యలకు గురవుతూ, అనేక దుష్టశక్తులకు హతమై పోతున్నాడో, వారి హృదయఘోషను కన్నులారా గాంచేటట్లు చేసి, హృదయం ద్రవీభూతం అయేటందుకు కృషి సలుపుదాం. ఇట్టి పరిణామాలు వచ్చేవరకు పోరాటం సలుపుదాం– అని ఎలుగెత్తి చాటండి. మీ పిలుపు వినడంతోనే వేలకువేలు ఉత్సాహవంతులైన యువకులు, స్త్రీలు, అభిమానులు మీ వెనకనే వచ్చి, ఏచోటకు వెళ్ళినా, సంపూర్ణ సహాయాన్నిస్తారు. అదే, మనం ఆశించే మానవసేవ, దేశసేవ. అదే, మన రామరాజ్యం. ఇట్టి మహత్తర ఆశయాల కొరకు విప్లవం లేవదీద్దాం... దీక్ష బూనుదాం... పట్టుదలతో కృషి సలుపుదాం... అదే నిజమైన ఆంధ్రరాష్ట్రం. అట్టి ఆంధ్రావనికి శాశ్వతమైన శ్రేయస్సును చేకూర్చి ధన్యులు కండి.

భవదీయులు,

"రామ్"–"ప్రసాద్"

---

'ఇది మార్చడానికి వీలులేని శాసనం' అని ఎవరైనా నాతో అంటే, నాకు అనిపించేది యిది: ఆ అన్నవాడు 'మార్చడానికి వీలులేని బుద్ధిహీనుడు'– సిడ్నీ స్మిత్.

కథానిక

# గురి తప్పని శరాలు

ఇచ్ఛాపురపు జగన్నాథరావు

అడ్వొకేట్ ముకుందరావుగారు పొడుం మరోపట్టు ముక్కుకిపంపించి మళ్లా ఆలోచనలో పడ్డారు. ఆయన దృష్టంతా ఎదురుగా కాగితాలమీద ఉన్నా, ఆలోచనలన్నీ జరిగిన విషయాల మీద ఉన్నాయని, మధ్యమధ్య ఆయన ఆకాశం కేసి ప్రతిఫలింప చేస్తోన్న చూపులు తెలియచేస్తున్నాయి. చదువుతూన్న పుస్తకాన్ని పక్కకి పెట్టి, సరదాగా చూస్తూ ఎదుటి గదిలో సిగరెట్ వెలిగించాను.

అలా రెండు నిముషాలు గడిచిపోయాయి.

"నేను పట్టిన కేసు పోవడానికి వీల్లేదు" అన్నారు ముకుందరావుగారు ఎదురుగా కూర్చున్న ముత్యాలరావుతో. ముత్యాలరావు ఆ కేసులో ఇరుక్కున్న వాళ్లని కోర్టుకి చేరవేసి, యథాశక్తి వాళ్ళ బరువులని తగ్గిస్తున్న పల్లెటూరి పంతులు. ఎదురుగా ముద్దాయి కూర్చుని వున్నా, ముకుందరావుగారు ఆ మాటలు ముత్యాలరావుతో అన్నారు.

"నాకు తెలియకుంటుందా?" అన్నాడు మధ్యవర్తి. "తమరు కేసుపట్టారు అంటే వాళ్లు విశాఖపట్నంనుంచి తెచ్చుకున్నారు ప్లీడర్ని. అందుకే నేను అప్పారావుకి కూడా ఈ కేసు గెలవక తప్పదనే విషయం చెప్పేశాను."

ఒక దోపిడీ కేసులో ముద్దాయీ, ముకుందరావుగారి క్లయింటూ అయిన అప్పారావు ఇంక ఊరుకుంటే బాగుండదని, "తమ పేరు చెప్తే ఆ మూడు తాలూకాలూ హడల్ అండి" అన్నాడు. నూటికి పది కేసులే గెలుస్తున్నా, బస్సుస్టాండులో దిగిన చుట్టం ఆయన ఇంటిని వెదుక్కోవడానికి అధమం గంట తాపత్రయ పడవలసి ఉన్నా, బంధించిన ఒక పరమసత్యాన్ని బయటపెట్టినప్పుడు లాగ చూశారు ముకుంద రావుగారు.

"మీ పేరు గనక బలు... అతగాడు అలా కే అంటాడులే. అయినా ఏదో చిన్నవాణ్ణిం. ఇలాగ బ్రతకనిస్తే..."

ముకుందరావుగారు అలంకారాలు లేకే సంభాషిస్తున్నారు. ఆ లేపనిద్దరూ సాంకేతికశక్తి ఆయనమాట కాదని, ఆ తరువాత ఆ పల్లెపట్టుల నున్న గొప్పతనం అనేకో దాన్నిగాలలో నిరూపించి, తిరిగి తమ కేసు విషయం ఆయన చేత ఎత్తించేసరికి వాళ్ళ పితామహులు దిగొంటారు. నా సిగరెట్టు కూడా అయిపోయింది.

"ఇప్పుడు క. ప్రమాదం వచ్చిపడింది" అన్నారు ముకుందరావుగారు, "కేసు మొత్తం అంతా పాడయ్యే ఒకమాట మన వాడితో సాక్షి చెప్పేడాడు."

అక్కడ ఆగి, ముకుందరావుగారు నస్యాన్ని మరోసారి నసాళాని కెక్కించారు. వాళ్లిద్దరూ తెల్లబోయి చూస్తున్నారు. వాడితో సాక్షి ఏమిటి చెప్పాడో వాళ్ళకి తెలీదు.

"ముద్దాయి దోపిడి జరగడానికి మూడు రోజుల క్రితమే ముసలయ్య ఇల్లు కొనడానికి బేరం ఆడాడని, ఆ సంవత్సరంలో త్వరలో కొంత డబ్బు చేతికి వస్తుందని అన్నాడనీ, పదరు సాక్షి చెప్పేడు. కాని, విషయం చూస్తే, ఈమధ్య అప్పారావుకి అందవలసిన మొత్తం అంటే ఇల్లు కొనడానికి ఉపకరించేంత పెద్ద మొత్తం అతని కందవలసినట్లు సాక్ష్యం లేదు."

అసలు ముకుందరావుగారి ప్రత్యేకత ఇలాటి మాటల ఉచ్చారణలోనే ఉట్టిపడుతూంటుంది. ఆ కోర్టుపక్షులకి తమ డబ్బుకి సరియైన ప్రతిఫలం ముడుతూన్నట్లనిపించింది మాటలు వింటూంటే. వాళ్లేమీ మాటలాడకుండా ఊరుకున్నారు.

ప్లీడరుగారు పూర్తిచేశారు. "అందుచేత,

సదరు దోపిడీ ఉద్దేశ్యం ముద్దాయికి ముందే ఉందని, వాది తరఫున వాదించడానికి అవకాశం ఉంది."

మళ్ళా కొంచెం సేపు నిశ్శబ్దంగా గడిచిపోయేక, ముత్యాలరావు "అయితే ఏమిటి చేయాలండి ఇప్పుడు?" అని అడిగాడు.

"నేను పట్టిన కేసు పోవడానికి వీల్లేదు" అన్నారు ముకుందరావుగారు దృఢంగా.

ఔను.

"ఈ కేసులో సాక్షి వాచాలత్వం వలన చాలా ప్రమాదం జరుగబోతోంది."

ఔను.

"నేను ఓడిపోతే మూడు సంవత్సరాలకు తక్కువ శిక్ష పడదు."

అప్పారావు తృళ్ళిపడ్డాడు.

"అందుచేత దీనికి ఉపాయం ఆలోచించాలి"

అంతా ఏకీభవించారు.

"ఏం చెయ్యమంటారో తమరే ఆలోచించండి" అన్నాడు ముత్యాలరావు.

"తమరెలా చెప్తే అలా చేస్తాం" అన్నాడు అప్పారావు.

ముకుందరావుగారు గాంభీర్యం వహించారు. శేషు పట్టుకువచ్చి టేబిల్ మీద పెట్టిన కాఫీ కూడా ఆయన గుర్తించలేదు. ఆలోచనా తరంగాలాయన ముఖంలో ప్రస్ఫుటమౌతున్నాయ్. నిమిషాలు నిశ్శబ్దంగా గడుస్తున్నాయి. ఆయన పచారు చేస్తున్నారు అవనతవదనంతో. ఆకాశంలోంచి దిగే అప్సరసలోకంలాగ మూడేళ్ళ జైలు జీవితాన్ని తలచుకుని వణుకుతూన్న అప్పారావు ఆయనకేసి ఆశతో ఎదురు చూస్తున్నాడు.

ఇంతలో హటాత్తుగా ముకుందరావుగారి ముఖాన కాంతిరేఖలు కనిపించి మిగిలినవాళ్ళ ముఖాలలో ప్రతిఫలించాయి. ఆయన కాఫీని ఒక్కగుటక్కలో మింగేసి, పాదుం పట్టు లోపలికి పంపి కుర్చీలో కూర్చున్నారు.

"సామ, దాన, భేద, దండోపాయాలు అన్నారు పెద్దలు" అంతా ఒప్పుకున్నారు.

"వచ్చే నష్టాన్ని వీలైనంత తగ్గించుకోవడం బుద్ధిమంతుల లక్షణం."

అక్కడ అంతా బుద్ధిమంతులే.

"మనం ఇప్పుడు మురళీగారిని పట్టుకోవాలి. ఆయన ద్వారా మేజిస్ట్రేటుగారికి ఓ అయిదువందలు ముట్టజెప్పి, శిక్ష ఒకటి రెండు మాసాలు పడేలాగ చూసుకోవాలి."

నిశ్శబ్దం.

"ఇంతకుమించి హరిహరాదులు వచ్చినా ఏమీ చెయ్యలేరు."

హరిహరాదులు కనిపించిన అప్పారావు ముత్యాలరావుకేసి చూశాడు.

"తమ ఉద్దేశ ప్రకారం కానివ్వండి" అన్నారు. అయిదువందలూ తక్షణం తెచ్చి ఇవ్వడానికి ఒప్పుకుని వాళ్లు వెళ్ళిపోయారు.

కథ ఇంతదాకా జరిగేదాకా నేను కంటి సాక్ష్యమే. తరువాత జరిగిన సంగతంతా శేషు ద్వారా తెలుసుకున్నాను. ఈ మురళిగారు మేజిస్ట్రేటుగారి గుమాస్తా. ఇచ్చిపుచ్చుకోవడాల్లోనూ, ఇతర రహస్య వ్యవహారాల్లోనూ ఆయనకి రాడార్ లాంటివాడు. కాని, నాలుగు నెలల క్రితం ఆయనకీ, ముకుందరావుగారికీ చెడిసింది. అంటే, ఒక కేసులో ముకుందరావుగారు ఓడిపోవడానికి అతను కారణం అయ్యాడు. అందుచేత, ముకుందరావుగారికి అంచాలన్నా, మురళీ అన్నా అసహ్యం పుట్టి పెరిగింది. అయితే, ఈ సంగతి మురళికి తెలియదు. ఎందుచేతనంటే, మురళి వాస్తవంగా ఆ కేసులో ఏమీ దగా చెయ్యక పోవడమే కాక, అతనికి ముసలి ముకుందరావు గారంటే కొంచెం గౌరవం కూడా ఉంది.

ఇదంతా ఎందుకు చెప్పానంటే, సదరు ముకుందరావుగారు ఈ ఇవ్వడం వ్యవహారమంతా స్వయంగా కాకుండా మురళికి సన్నిహితుడైన ఇంకొకడి ద్వారా నడిపించడం, కేవలం ఆత్మగౌరవంవల్ల కాదని.

ఎలాగైతేనేం అయిదువందలూ మేజిస్ట్రేట్ గారికి అందాయి. కేసు వాయిదారోజు వచ్చేసింది. సాయంత్రం నాలుగైంది. ముకుందరావుగారు ఇంటికి వచ్చారు. వెనుక అప్పారావూ, ముత్యాలరావూ ఉన్నారు. వాళ్లు పుస్తకాలు పట్టుకున్నారు ఆయనవి.

ఇంట్లో అడుగు పెడుతూనే, "నేను చెప్పలేదుటోయ్? వాళ్ళ వకీలు ఈ పాయింటు పట్టుకుని ఓ ఊపు ఊపుదామని చూశాడు. కాని...

నువ్వు ముకుందరావుగారికి ధనికెగరగొట్టి చెప్పావు. అసలు మూడు సంవత్సరాల శిక్ష... నాలుగు నెలలకి దిగింది. అందులో డబ్బు మహాత్మ్యం లేకపోలేదనుకో." ఆయన నానాబాధా పడుతున్నాడు తన గొప్పతనం నిరూపించడానికి. వాళ్ళిద్దరూ ఏడవాలో నవ్వాలో ఎరగక ఆయన పాటకి తాళం వేస్తున్నారు చాలానకు మూగగానే.

ఏది ఎలాగ ఉన్నా, అప్పారావు జైలుకి వెళ్ళాడు. నేను తరవాత ట్రాన్స్‌ఫర్ అయి ఈ ఊరు వచ్చేశాను.

కొంతకాలం తరవాత మురళిని కూడా ఇక్కడికి బదిలీ చేశారు. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో మేమిద్దరమూ ఒకర్నొకరు సత్రింమనుకుని మిత్రులమయ్యాము.

బాగా పరిచయమయ్యాక ఏదో మాటల సందర్భంలో మురళి అన్నాడు: "ప్లీడర్లు చాలా విచిత్రమైనవాళ్ళుంటారు. తన క్లయింటుకి శిక్ష తప్పించుకునేవాళ్లూ ఉన్నారు. కావాలని శిక్ష వేయించేవాళ్ళూ ఉన్నారు."

"ఏమిటది?" అని అడిగాను కొంచెం ఆశ్చర్యంగా వినపడి.

"ఒకసారి ఒకకేసులో చాలా అన్యాయం చేశాన్లే. ఐదువందలువస్తున్నాయని మేజిస్ట్రేటు చేత నాలుగునెలల శిక్ష వేయించాను అమాయకుడికి."

ఈ మధ్య తగిలిన దెబ్బలవల్ల కాబోలు మురళికి కొంచెం మనసు మారింది.

"అసలు జరిగిన దేమిటంటే ఒక ప్లీడర్ గారు—రహస్యం ఎందుకు, ఆ ఊళ్ళో ఉండే ముకుందరావుగారి దగ్గరికి ఒక కేసు వచ్చింది. ఒక దోపిడీకి కారకుడని, ఒక అమాయకుడిని కోర్టులో నిలబెట్టారు. వాడు ఆయనని ప్లీడరుగా పెట్టుకున్నాడు. కేసంతా దక్కగా నడిపించాడాయన, అలవాటు ప్రకారం పొడు చెయ్యకుండా.

"కాని, ఇక రెండు రోజుల్లో జడ్జిమెంటు చెప్తారనగా, ముకుందరావుగారు ఒక మధ్యవర్తి ద్వారా అయిదువందల రూపాయలు పంపించి, ఆ ముద్దాయికి మూడు నెలలు శిక్ష వేయించమన్నారు.

మేజిస్ట్రేట్ గారికి ముద్దాయి నిర్దోషి అని నిశ్చయం చేసుకున్నాడు. కాని అయిదు వందలు వదులుకోలేక ముద్దాయికి నాలుగు నెలలు శిక్ష వేశాడు.

"ముకుందరావుగారి ఉద్దేశంమాత్రం నాకిప్పటికీ బోధపడలేదు. ఎంత విచిత్రమో చూశావా?"

నా ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ, ఆ ముద్దాయి పేరూ అదీ అడిగాను. అప్పారావే!

"ఇదంతా చాలా రహస్యం సుమా!" అన్నాడు మురళి మళ్ళా.

అసలు సంగతి చెప్పాలని అనుకున్నాను. కాని, మురళి మనశ్శాంతి చెడపడం ఇష్టంలేక ఊరుకున్నాను.

నేటికి కూడా నేనీ రహస్యంలో బాధపడుతున్నాను. అప్పారావు విడుదలయి తేలిక పడ్డాడు. ముకుందరావుగారూ చచ్చి తేలిక పడ్డారు. మురళి తన నేరం నాతో చెప్పుకుని తేలికపడ్డాడు. ఎటొచ్చీ, ఈ రహస్యభారంతో నేనే క్రుంగుతున్నాను లోకంకోసం.



ప్రజాజీవితం ఒకసారి పూర్తిగా కల్మషం అయిననాడు, యిక చట్టాల ద్వారా, శాసనాల ద్వారా- ఆస్తి హక్కులు, పౌరహక్కులు, స్వేచ్ఛ- వీటిని సంరక్షింప బూనడం వృథా ప్రయాస అవుతుంది. ఏదయినా ఫలవృక్షానికి చీడ పడితే, ఆ చీడపురుగుల్ని బహిష్కరిస్తూ నోటీసులు వ్రాసి చెట్టుకి అంటిస్తే ప్రయోజనం ఏముంటుంది?—హొరేస్ మాన్.

శాసనాలన్నవి సాలెగూడుల వంటివి. నిరుపేదలూ, నిర్భాగ్యులూ అందులో ఇరుక్కుని నశిస్తారు. ధనికులూ బలవంతులూ వాటిలోంచి దూరి బయటపడతారు—ఎనాకార్సిస్,

# శాశ్వతమైన కొయ్యకాలు

(కథానిక)

"ఏరా! వచ్చిందా?"

"ఏమిటే?" పెళ్ళి చూపులకు వెళ్ళొచ్చిన కామేశ్వరరావు కోటు విప్పి వంకెకు తగిలిస్తూ, అర్థయుక్తంగా అన్నాడు వెనుక నుంచున్న తల్లిని ముందున్న అద్దంలో ఓరగా చూసి.

"మా కోడలురా?" అప్పుడే బంధుత్వాన్ని కలిపేసింది తెలివైన కాంతమ్మ కొడుకు అంగీకారానికి ప్రోత్సాహాన్నిస్తూ.

"నాకు భార్య కాకుండానే నీకు కోడలెలా అవుతుందే అమ్మా?" సైకాలజీ ఆనర్సులో మొదటివాడుగా ప్యాసయిన కామేశ్వరరావు తన అయిష్టాన్ని అంత మృదువుగా తన మీద గంపెడాశ పెట్టుకున్న తల్లికి తెలియ జేశాడంటే ఆశ్చర్యపడవలసిందేమీ లేదు.

"ఒరేయ్! అప్పుడే పెళ్ళాన్ని వెనకేసుకు వస్తున్నావేమిరా? అందుకే కామోసు అంటారు; కోడల్ని తెచ్చుకోటం అంటే కొడుకును పోగొట్టుకోవడమని." కొడుకు అభిప్రాయం పక్కదారిన పడుతుందేమోనని అనుమానించిన కాంతమ్మ సంభాషణను తన దార్లోకి లాక్కుంది. తల్లి చాకచక్యంతో తెలివిగా మాట్లాడుతుందని కామేశ్వరరావుకు తెలిసినా మరీ యింత అసాధ్యంగా మాట్లాడుతుందని అనుకోలేదు.

"సరేలేవే! నీకు ఇష్టంగాని కోడలు నాకు భార్య కాలేదులే అమ్మా" తల్లి తీయదలుస్తున్న అర్థాన్ని బోల్తా కొట్టించాడు కొడుకు.

"అదేం మాటలేరా కామూ! మీరిద్దరూ చిలకా గోరువంకల్లా మనసులు కలిసి సుఖంగా వుంటే మాకదే చాలు. మేమిప్పుడింక యింత తిని కృష్ణా రామా అనుకుంటూ, దేవుడి మీద మనసు పెట్టి కాలక్షేపం చేస్తాం. మహా యీ జన్మకింతే చాలు. వచ్చే నెల దాటితే లగ్నాలు లేవు. మూట్లూ గీట్లూ కుట్టించాలి గామోసు, మీ నాన్నగారు రాగానే డబ్బు అడిగి తీసుకో."

"ఎందుకే యిప్పుడు అవన్నీను."

"ఇప్పుడు గాకపోతే మరెప్పుడురా? ఆఁ అన్నట్టు పట్టు చీరలు కూడా తేవాలి".

తల్లి మాటల్లో తన్ను పెళ్ళి కూతురుకు పెట్టబోయే పట్టు చీరల దాకా నెట్టుకుపోయే సరికి, వాక్యపు సంభాషణలో ఓడిపోయిన కామేశ్వరరావుకు, ఆ యూనివర్సిటీలో నేర్చుకోలేనిదేదో ఏమ్మొయింటి ప్రహరీ గోడల మధ్యనే నేర్చుకున్నట్టనిపించింది. తన అయిష్టాన్ని అంగీకారంగా మారుస్తున్న తల్లి ధోరణికి జావగా అయిన కొడుకు కట్టె విరిచినట్టు చెప్పక తప్పలేదు.

"అదికాదే అమ్మా! ఆ పిల్ల నాకు నచ్చలేదే."

"రత్నాలు వచ్చుకు, వత్తుగుల్లలు వచ్చుతా యిరా పిచ్చినా తండ్రీ." వ్యంగ్య ధోరణిలో వెనక్కు తగ్గిన కొడుకును గమనించి చురుగ్గా అంది కాంతమ్మ.

"ఆ పిల్లకు......"

"ఛీ! అలా అనకు ఎవరన్నా వింటే నవ్విపోగలరు. అయినా మన కిష్టమయి చేసుకునే దానికి అలా లేనివి వెతకటం మనకే వెర్రి కదరా?"

ఇంతకీ కామేశ్వరరావు కళ్ళకు అలా కనిపించింది లక్షాధికారి జానకయ్యగారి ఏకైక పుత్రిక జానకి.

* * *

జానకయ్యగారు తన కూతురిని సీతారామయ్యగారి కొడుక్కు యిస్తాననడం అతని పది ఎకరాల లోపుగావున్న ఆస్తిపాస్తులను చూసి కాదు. ఏదో కామేశ్వరరావు బాగా చదువుకున్నవాడనీ, తెలివికలవాడనీ, పైగా పదిమందిలో అవుననిపించుకున్న బుద్ధిమంతుడనీ, ఎంతో మర్యాదలు కలవాడనీ యివ్వడం. ఏమైనా యీ విషయంలో జానకయ్య

గారు వుదారత్వంతో కూడిన విశాలత్వాన్ని, వివేకాన్ని ప్రదర్శించారనక తప్పదు. కామేశ్వరరావుకు అసహజంగా కనిపించిన ఆ వుదారత్వమే అతనిఅనుమానానికి కారణం కావచ్చు.

ప్రతి చిన్న విషయాన్ని వాస్తవికదృష్టితో పరిశీలించే స్వభావం అతనిది మొదటినుంచీ. ప్రతి సంఘటనకూ తనకు తోచిన కారణాలను ఆపాదించి, నిర్ణీతమైన వుద్దేశ్యాలను సిద్ధాంతీకరించుకునేవాడు. కాలేజీలో పుస్తకాల్లో చదివిన మనస్తత్వ శాస్త్ర విజ్ఞానంతో జీవితంలో పరిసరాల్లోని మనుషులను, సంఘటనలను కొలిచి, తూచి సరిపోల్చుకునేవాడు.

అతను మాట్లాడుతుంటే ఒక్కొక్కసారి మనస్తత్వ శాస్త్రంతో కూడిన అతని ధోరణి ఎదటివాళ్ళను ఎక్కడికో తీసుకుపోయినట్లువుండేది. చాలమందికి అర్థంకూడా అయేది కాదేమో.

ఫలానా జానకయ్యగారి కూతురిని తనకిస్తారని అమ్మ చెప్పిన దగ్గర్నుంచీ, కామేశ్వరరావుకు ఆ లక్షాధికారుల ఆస్తిలోనో, ఆ పిల్లలోనో ఏదో వుండి వుండాలనే అనుమానం పట్టి పీడిస్తూంది. రహస్యంగా యింట్లో ఎవరికీ చెప్పకుండా వాళ్ళుండే జానకయ్యగారి వూరు వెళ్ళొచ్చిన కాము, తన అనుమానాలను వాస్తవిగా దృఢపర్చగల విశేషాలను తెలుసుకోలేకపోయినా, కతాచితుగా ఆనోటా ఆనోటా కొంత వినలేకపోలేదు. అడిగే వాడువుంటే ఏదో కొకటి చెప్పేవాడు వుండక పోడుగా మరి!

పెళ్ళి చూపులకు వెళ్ళిన కామేశ్వరరావు మనసులో అది మెదుల్తూనేవుంది. జానకయ్యగారి పెద్ద బంగళా, చిన్న కారూ, కుషన్ కుర్చీలు, కొక్కలు, హోదాకుతగ్గ అతిథి మర్యాదలు, అన్నిటినీ మించివున్న ఆనాటి అల్పాహార విందు; పెళ్ళి చూపులకు వెళ్ళిన కాము, కాము తండ్రితో పాటు పెద్దలవందరిని సంతృప్తితో కూడిన ఆశ్చర్యంలో ముంచివేశాయి. తమకు తెలీకుండానే మగ పెళ్ళివారైవుండి కూడా చిన్న వాళ్ళుగా మరీ చిన్నవాళ్ళుగా కుంచుకు పోయారు.

సీతారామయ్యగారు కొడుకును ఆ కొంచెం కాలంలోనే కొన్ని వందలసార్లు సగర్వంగా చూసుకున్నాడంటే అతిశయోక్తి యేమీ లేదు.

కొడుక్కు రాబోతున్న ఐశ్వర్యాన్నితలుచుకుంటూన్న తండ్రి మనసు వీలైనంత త్వరలో "అవును" అనుకొని బయట పడాలని ఆరాటపడింది.

తాము కూర్చున్న గదిలోకి పిల్లను తీసుకురాకుండా, అంతకుముందే ఏర్పాటుచేసినగదిలో తమ్ము ఆహ్వానించడంలోనే కామేశ్వరరావులో అందాకా ఆశ్చర్యం అడుగున పడిపోయిన అనుమానం మళ్ళీ మెదిలింది.

సుస్తాబులోవున్న జానకిని చూసి ముగ్ధుడై పోయాడు కామేశ్వరరావు. హృదయంలోని రసికత్వపు తాలూకు తలుపులు తెరవబడినై. గాఢనిద్ర పోతున్న సౌందర్య పిపాస మేలుకుని వళ్ళు విరుచుకుంది. తుమ్మెదబారుల్లా ఆ నొక్కుల జుట్టు, గోలమొహం, విశాల నేత్రాల్లోని ఆకర్షణ, కాటుక పెట్టుకున్న ఆ ముక్కు, వంపులు తిరిగి గులాబి రేకుల్లాంటి ఆ పెదిమలు, నీల విద్యుద్దీపపు కాంతుల్లో మెరుస్తూ జార్జెట్ సిల్కు చీరలోను, నైలాన్ సిల్కు జాకెట్ లోను దాచివున్న ఆమె శరీరపు నిమ్నోన్నతాల తాలూకు లావణ్యపు తొణికిసలు, చూస్తున్న మనస్తత్వవేత్త కామేశ్వరరావుకు మానవుడు ఎప్పుడు ఎందుకు కళాజీవిగా మారుతాడో మొదటి సారిగా అర్థమైంది.

యవ్వనం తాలూకు సిగ్గు, సౌందర్యం తాలూకు గర్వం, ఐశ్వర్యం తాలూకు అహంభావం స్పష్టంగా ఆమె ముఖంలో చూడగలిగాడు కాము.

"తాంబూలం పుచ్చుకొని ముహూర్తం నిర్ణయించండి అవధాన్లుగారూ!" సీతారామయ్యగారు అన్న మాటలు కామును యీ ప్రపంచంలోకి లాక్కువచ్చాయి. అతనిలోని హేతువాదనాశక్తి కదిలి, అందాకా లోలోపలే మెదుల్తాన్న అనుమానాన్ని బయటికి నెట్టింది.

"ఆ! అమ్మాయిని లేచి నడవ మనండి?" అంత కటువుగా అతను ఎలా అనగలిగాడో అతనికే తెలియదు. సీసం కరిగించి పోసినట్టుంది మిగతా వాళ్ళకు.

జానకి కుడిచేయి ఎడంకాలి చివర చీర అంచుపైన, కాము కళ్ళు ముద్దుగా పక్కకు

తిరిగివున్న ఆమె పాదంపైన వొకసారి పడినై.

ఆమె గాభరాగా చీరను పాదం కిందకు లాక్కుంది. కాము కళ్ళు యింటి కప్పుపైకి పోయినయ్.

ముందుగా, జానకయ్యగారి కొడుకు కామేశ్వరరావును వాళ్ళవూరు తీసుకొచ్చి యింటి ముందు దించింది. కాము తండ్రి తాంబూలాలు అందుకొని ముహూర్తం నిర్ణయించుకొని తర్వాత వచ్చాడు.

సీతారామయ్యగారు యింటికి వచ్చేసరికి తల్లీ కొడుకు సంభాషణ ముమ్మరు పాకాన పడి ఈ ధోరణిలో నడుస్తూంది.

• • •

"అయితే నీవనే దేమిటే అమ్మా! ఆ కుంటి పిల్లను చేసుకోమనేనా?"

"ఏమిటిరా ఆ వాగుడు? నోటికి హద్దూ అదుపూ వుండక్కర్లేదా?" వాకిట్లో నుంచి అన్న తండ్రిని చూసి నిర్ఘాంతపోయాడు కాము.

"ఇంతకీ ఏమి చేసుకొచ్చారేమండీ?" కాంతమ్మ ఆదుర్దాగా అడిగింది.

"తాంబూలం అందుకొన్నాం. వచ్చే నెల మూడో వారం చివర్లో లగ్నం నిశ్చయం చేసుకున్నాము కూడా."

భర్త అలా చెప్తుండగా విన్న కాంతమ్మ మనసు శాంతపడింది.

"అసలు నాకిప్పుడు పెళ్ళే వద్దు!" విసురుగా లేచి వాకిట్లో చెట్టో పక్కగా నిలుచున్న తల్లీ తండ్రీ మధ్యగా చూసుకుని బయటకు వెళ్ళిపోయాడు కాము.

భార్యాభర్తలిద్దరూ వొకరి మొహం వొకరు చూసుకుంటూ అలానే నుంచుని వుండిపోయారు.

సీతారామయ్యగారికి, కాంతమ్మకు తెలియకపోలేదు జానకయ్య కూతురు కాలు కొంచెం అవుడని. అయినా లక్షరూపాయల ఆస్తితో వస్తూన్న కోడలి పాదం కొంచెం పక్కకు తిరిగి వున్నందువల్ల ముంచుకుపోయింది ఏమీలేదని అభిప్రాయపడ్డారు. ఆ కాలు కారణంగా లక్షరూపాయల ఆస్తికి మోకాలు అడ్డుపెట్టడం సీతారామయ్యగారికి సుతరామూ యిష్టంలేదు. అంత చదువుకున్న కొడుకు యీ మాత్రం డబ్బు విలువ తెలియని అవివేకి అనుకోలేదు. అందుకే జానకయ్యగారు యిస్తామన్నదే తడవుగా ఎగిరిగంతేసి సీతారామయ్య తన యిష్టాన్ని తెలియజేశాడు. కాంతమ్మకు మట్టుకు వో బంగారపు గని దొరకినట్టుగా వుంది. కాగుమరి, శ్రీలక్ష్మి తనకు కోడలై వస్తూంటే! అదంతా తన పూర్వజన్మ సుకృతఫలం కాకపోతే అంత అదృష్టవంతుడు తన కడుపున ఎలా పుడతాడు. దేనికయినా పెట్టిపుట్టాలి మరి! అనుకుంది కాంతమ్మ మనసులో.

జానకయ్యగారి కూతురు అందచందాలను గురించి, వంశగౌరవాన్ని, ఐశ్వర్యాన్ని గురించి చెవి నిల్లుకట్టుకొని చిలవలు పలవలుగా వర్ణించి కొడుక్కు చెప్పిన కాంతమ్మ మనసులో జానకి కుంటికాలు మెదలకపోలేదు. ఆవిడ ఎడం పాదం కొంచెం పెడదిరిగబట్టే శ్రీలక్ష్మి తన గడపలో కుడికాలు మోపే అవకాశం కలిగిందని లోకజ్ఞానం గల కాంతమ్మ గుర్తించింది. ఎందుకైనా మంచిదని కొడుకుదగ్గర కావాలనే ఆ ప్రస్తావన వదలివేసింది. కాముకు చూచాయగానే తెలిసే వుంటుందని అభిప్రాయపడ్డది కాంతమ్మ.

ఇంతకూ కామేశ్వరరావు మనసు విరిచిన జానకి కుంటికాలును చూచినవాళ్ళను వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. జానకి బయటకు రావడం తటస్థిస్తే కార్లో వచ్చి కార్లోనే పోతుంది. హై హీల్సు శాండల్సులో, నేలను తాకుతూన్న చీర అంచుల్లోంచి ఆ కాలును కళ్ళతో చూసినవాళ్ళు ఎంతమంది వున్నారు తెలిసినవాళ్ళు మనసులో అనుకోటం తప్ప? జానకి నడక కూడా ఏమీ పట్టివేసినట్టుగా వుండదు.

అట్లా లేచిపోయిన కాము రాత్రి చాలా పొద్దుపోయి గాని యింటికి చేరలేదు. బయట అరుగుమీద, కడుపులో మోకాళ్ళు పెట్టుకొని కునికిపాట్లు పడుతూన్న తండ్రిని చూసీ చూడనట్టే లోపలికి పోయాడు.

పైటచెంగు పరుచుకొని గడప పక్కగా పడుకున్న తల్లిని చూడగానే కాము గుండె గతుక్కుమంది. అమ్మను పిలిచి లేపాడు.

కొడుకుని చూడగానే ఏడిచేసి కళ్ళు తుడుచుకుంది పైటచెంగుతో కాంతమ్మ.

"అర్థరాత్రయినా అన్నానికి కూడా రాకుండా ఎక్కడ తిరుగుతున్నావురా?"

"నాన్న తిన్నాడా?" అనుమానంగానే అన్నాడు కాము.

"ఊఁ! నీవలా వెళ్లినప్పట్నుంచీ ఆ రకంగా కూర్చుని వున్నారు. మళ్లీ గుండె నొప్పేమైనా వచ్చిందో ఏమో?"

"ఇప్పుడు ఆయనగారు అంత కదిగా బాధ పడవలసిందేముందే?"

"పదిమందిలో అవునని అనుకొని వచ్చాక, లేపు కాదని ఏ మొహంతో నలుగురినీ చూడడం అని సాయంకాలంనుంచీ అవడాన కూర్చుని కుమిలిపోతున్నారు కూడూ నీళ్ళూ లేకుండా. వాడిలా చేస్తాడని కలలో కూడా అనుకోలేదని అంటూ కళ్ళ నీళ్ళపర్యంతం అయ్యారు."

"అయితే ఇందులో నా తప్పు ఏముందే?"

"ఏమోరా? మీ యిద్దరిమధ్య నే చచ్చిపోతున్నాను. ఆయనగారి మొహం చూస్తూ యీ యింట్లో నేనుండలేనురా, నాకు నీ దెక్కువై పోతూంది." అంటూ కాంతమ్మ కళ్లు తుడుచుకుంది.

తల్లి కన్నీళ్ళతో కాము హృదయం మెత్తపడింది.

"సరేలే అమ్మా! మీ యిష్టం వచ్చినట్టే కానీయండి."

అసలు కామేశ్వరరావు స్వతహా ఉన్నత హృదయం గలవాడు. పైగా తెలిసినప్పట్నుంచీ తల్లితండ్రులకు కష్టం కలిగించే పనేదీ చేయలేదు. తన కారణంగా ఇవాళ అమ్మా నాన్న తీరని వ్యథకు గురి అవుతున్నారనే బాధ కాము పట్టుదలను కొంత సడలించింది. అంత అందమైన జానకిలో అంత ఆస్తిగల జానకిలో తాను చూస్తున్న లోపం—జానకిని నిరాకరించవలసినంత బలమైంది కాదేమో ననిపించింది కాముకు తల్లి మొహం చూస్తుంటే.

"ఏమండోయ్! నేను చెప్పలేదటండీ వాడొప్పుకుంటాడని!" ఒక్క గంతు వేసింది కాంతమ్మ బయట అరుగుమీద కూర్చున్న భర్త దగ్గరకు.

కాని ఆ రాత్రి కామేశ్వరరావుకు సరిగా నిద్రపట్టలేదు. అతను వద్దనుకున్నా మెదడు ఆలోచించడం మానలేదు. అందుగ్గాను మనసు బాధపడకా తప్పలేదు. కాలేజీలో చదువుకున్న మనస్తత్వ శాస్త్రగ్రంథాల తాలూకు పుటలు వొక్కొక్కటే అతనిరెప్పల్లో తిరిగాయి. తన భవిష్యత్తులో కాలుమోపుతున్న జానకి కుంటి కాలు, తన సంసార జీవితాన్ని సిద్ధాంతాల్లోని విశ్వాసాన్ని, మానవత్వంపైని నమ్మకాలను వెన్నుచరిచి వెక్కిరించి సవాలు చేస్తున్నట్టనిపించింది. లక్షరూపాయల ఆస్తికోసం తన భావి జీవితాన్నే బలిపెడుతున్నట్టుగా తోచింది. మానసికవ్యాకులతలోనైనా విజయవంతం కాని సంసారాలు, భిన్నజీవులు మనసులో మెదిలారు. తాటాకు మంటల్లా లేచిన ఆలోచనలతో సతమతమయ్యాడు కాము. కళ్లుమూస్తే సరి పీడకలలు. కుంటివాళ్లు, గుడ్డివాళ్లు, వికలాంగులు అంతా బీభత్సంగా నరకకూపంలా వుంది. ఆ మోహమయంలో, ఆ వేదనల్లో తెల్లవారింది ఆ రాత్రి కామేశ్వరరావుకు.

ఉదయం తన గదిలోకి కాఫీ తెచ్చిన తల్లిని చూడగానే, అంతవరకూ పదేపదే మననం చేసుకుంటూన్న తన కఠోర నిశ్చయాన్ని తెలియచేశాడు కాము.

"ఆ కుంటిదాన్ని నేను చేసుకోను!"

"మళ్ళీ ఏ మొచ్చిపడిందిరా?" కాంతమ్మ కలవరపడుతూ అంది గ్లాసు బల్లమీద వుంచుతూ.

కొడుకు ముభావంగా వుండటం గ్రహించిన కాంతమ్మ మొదలు పెట్టింది.

"ఒరే కామూ! నీదంతా వట్టి భ్రమ కాకపోతే ఏమిటిరా? రంభలాంటి పిల్ల కొండంత బంగారంతో వస్తూంటే ఏదో ఎక్కడో వంక వుందని వద్దంటావు. పాదం కొంచెం పక్కకు తొలిగివున్నంత మాత్రంచేత వచ్చే నష్టమేమిటిరా తెలియకడుగుతానుగాని?"

"అమ్మా! జానకి [illegible]ల్లో కుంటుకుంటూ నడుస్తూంటే..."

"కదిలితే మెదిలితే కార్లో తిరిగే లక్షాధికారి కూతురు కింద నడవవలసిన అవసరమేమిటిరా? మంచంమీదనుంచి కాలు కింద పెట్టకుండానే నౌకర్లచేత చేయించుకో గలిగిన

ఐశ్వర్యవంతురాలు జానకి. జానకయ్యగారు కూతురిని పూలలో పెట్టి పూజించుకొంటూ దురా. ఊరికే పిచ్చిపిచ్చి భ్రమలు పెట్టుకోక."

తక్కున అందుకున్నాడు కామూ. "అమ్మా! కొన్నా డబ్బు, ఐశ్వర్యం యివాళ వుంటాయి, రేపు పోతాయి. అయిదు సంవత్సరాలనాడు జానకయ్యకు యింత ఆస్తి లేదు."

"కామూ! నీవు మరీ పట్టి వాదస్తాన పడ్తున్నావురా?" తల్లి కొంచెం కటువుగానే అంది.

"అమ్మా! అశాశ్వతమైన కొర్కెలా, సంపదా నమ్మి శాశ్వతమైన కుంటికాలును తెచ్చుకోమంటావా? జీవితాంతం అశాంతితో అలగారి పొమ్మంటావా?"

కవిత్వధోరణిలో పడ్డాడు కామేశ్వరరావు. తల్లి మూతి ముడుచుకుని మొహం పక్కకి తిప్పుకొంది.

"అమ్మా! నాకు కలగబోయే సంతానం నీ మనుమలు, మనవరాండ్రు కుంటివాళ్లు గుడ్డివాళ్లుగా వుండాలని కోరుతావా?"

"ఛీ! వూరుకోరా! నీ మాటలు నిప్పులు. ఆ పిల్లకు చిన్నప్పుడు కాలుజారి మెట్లమీద నుంచి పడితే కాలు కొంచెం పక్కకు తొలగింది. అంతమాత్రానికే పుట్టబోయే సంతానం గుడ్డివాళ్లు కుంటివాళ్లు అవుతారా ఏమిరా?"

"కాదమ్మా! ఆ పిల్లకు పుట్టుకతోనే వచ్చింది."

"అబ్బ! ఏమోరా! ఎట్లయినా ఒకటేరా!"

వంశపారంపర్యం, వారసత్వంపై పుస్తకాలు చదవని కాంతమ్మకు నొకటిగా కన్పించినా, కామేశ్వరరావుకు మాత్రం అందులో చచ్చేంత భేదం కన్పించింది.

ప్రకృతి పరిణామవాదంలో వంశాను బంధంగా వచ్చే అనేక వికారాలను గురించి చదువుకున్న అతను వొంటె మెడ యెందుకు పొడుగ్గావుంటూ వచ్చిందో దాని పిల్ల మెడ కూడా తిరిగి అలాగే యెందుకుంటుందో, ఎలుకలమీద యిక్స్‌పెరిమెంట్లు చేసి, క్రోమోజమ్సును గురించి తెలుసుకున్న కామూ, వాటిని మనసులో వుంచుకొని మాట్లాడుతుంటే తల్లికి కొడుకు పిచ్చివాడై పోతున్నాడేమో నని పించింది.

"వాళ్లవంశంలో ఎవరికీ లేనిది ఆపిల్లకు ఎలా వచ్చిందిరా? మాముత్తాతకు ఓ చెయ్యిలేదట! మరి ఆ చాలు అందరికీ రాలేదేంరా?" కొడుకు తెలివి తేటలకు వళ్ళు మండిన కాంతమ్మ అక్కసుకొద్దీ అంది.

కామేశ్వరరావు యిరుకున పడ్డాడు. దానికి కారణాలు వున్నాయని తెలుసు. కాని ఎక్సెప్షన్ థియరీని గురించి అమ్మకు చెప్పినా అర్థం కాదనే వూరుకున్నాడు.

"అవునురా. జానకి కాలు కింద పడిపోతే అలా అయిందిరా" వెనకటి సంగతిని గుర్తుకు తెచ్చుకుంటూ అంది కాంతమ్మ.

"ఏమైనా ఆ కుంటిదాన్ని నేను చేసుకోను." దృఢ నిశ్చయాన్ని తెలియజేశాడు.

కొడుకు మొండి తనానికి సహనాన్ని కోల్పోయిన కాంతమ్మ వలవలా ఏడ్చింది.

"అయితే యిహ నేను వురి వేసుకుంటాను లేరా."

"ఆ వురి నా మెడకే తగిలించవే! యిష్టం కాని వో గుదిబండను మెడకు కట్టుకుని జీవితాంతం బాధ పడేకంటే అదే మేలు." ఏదైతే తన సుఖం కోసం తల్లి తంత్రాలు చేయాలను కుంటున్నాదో అదే తనకు నరకమౌతున్నదని తలుచుకొన్న కామూ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మాతృ హృదయం కన్న సహించలేదో, ఎక్కడ బలహీనంగా వుంటుందో అక్కడే గురిచూసి దెబ్బకొట్టేడు కామూ.

"సరే లేరా, అంత ప్రాణంమీద కొచ్చిన పెళ్ళెందుకు లేరా!" ఏదో అఘాయిత్యానికి పాలు పడ్తాడేమోనని అనుమానించిన కాంతమ్మ

"ఏయ్ దొంగననుకున్నావేమిటి? పోనీ పోనులే. చేతులు దించనియ్యి. నెప్పి పుడుతున్నాయి."

కన్నయ్యకు జాలివేసింది. "దించు" అన్నాడు.

వెంటనే ఆ వ్యక్తి చేతులు దించివేసి కోటు సవరించుకుని ధైర్యంగా అన్నాడు. "ఆ... యిప్పుడు చెప్పు. నన్ను ఎవర్ననుకుని అడ్డగించావ్?" అతని కోటు అరిచేతులవరకూ వచ్చేసింది. యిదో ఫ్యాషన్ కాబోలు.

కన్నయ్య తన తెలివి ప్రయోగించాడు. "తెలీదు. ఎవరివో చెప్పు" పాపం ఆ వ్యక్తి తడబడపడ్డాడు. "నేనా? నేను..." అని నసిగాడు.

"అపరాధ పరిశోధకుడివా?" అని వ్యంగ్యంగా నవ్వాడు కన్నయ్య.

"ఏం? ఎందుకు కాకూడదు?"

"చాలించవయ్యా యింక" అన్నాడు కన్నయ్య కొంచెం కోపంగా. "రా లైటులోకి రా. ఏమాత్రం సంగ్రహించావో చూడని!" అని భుజంమీద చెయ్యేసి దీపంక్రిందకి లాక్కుపోయాడు.

ఆ వ్యక్తి పూర్తిగా భయపడిపోయాడో, మరి నిశ్చయంగానో కన్నయ్య చేస్తున్న పనికి ఏమాత్రం అంతరాయం కలిగించలేదు. కన్నయ్యకి యథేచ్ఛగా తన చేతులను కోటు కుడివైపు జేబులోనికి జొనిపి అక్కడున్న కాగితాలను బయటకు లాగాడు. కళ్లు చెదిరిపోయాయి. వందరూపాయలనోట్లు. లెక్కవేస్తే పదిహేను వున్నాయి. ఆశ్చర్యంలోనే ఎడంవైపు జేబులోకూడ చెయ్యి దూర్చి ఏదో బయటకు లాగాడు. అది ఒక డైరీ. దానిమీద "ఒ. విలాసరావు" అని వ్రాసివుంది. ఆశ్చర్యంతో డైరీ తెరిచాడు. మొదటి పేజీలో విజిటింగు కార్డు వున్నది. కన్నయ్య వింతపడి చదువుకున్నాడు.

అది చదివిన మరుక్షణంలో కన్నయ్య అదిరిపడ్డాడు. భయంతో ఒళ్లు కంపించిపోసాగింది. చటుక్కున రూపాయలూ, డైరీ కోటు జేబుల్లో కుక్కేసి, నిటారుగా నిల్చుని, కాళ్ళు క్రమంలో పెట్టి సెల్యూటు చేశాడు.

"క్షమించండి సార్. తమన్ని అనుమానించినందుకు మన్నించండి."

ఆ వ్యక్తి కోటు గుండీలు పెట్టుకుంటూ "అది నీధర్మం. నీ వృత్తి నువ్వు చేయాలి కదా" అన్నాడు.

"అలాకాదు సార్, మీరు తలుచుకుంటే నా వుద్యోగాన్ని కూడా పీకించెయ్యగలరు. మీరు సి. ఐ. డి. యిన్‌స్పెక్టరుగా ఈ వూరు వచ్చారని విన్నాను. గాని ఇంతవరకూ మిమ్మల్ని దర్శనం చేసుకోలేదు."

"దానికేంలే. అయితే నేనింక వెళ్ళవచ్చునా?"

కన్నయ్య తలూపి చటుక్కున గుర్తు వచ్చి అడిగాడు. "ఆ వేషం మీదేనా సార్?"

"అవును. ఏం?"

కన్నయ్య నసిగాడు. "అయితే యింత రాత్రివేళ..."

అతను నవ్వుతూ 'అంటేనా? రాత్రివేళ బయటకు ఎందుకు వెళ్తానో ఊహించావా? 'ఊఁ'' అని కన్ను గీటాడు. కన్నయ్య నవ్వుకుంటూ సెలవు పుచ్చుకుని బయలుదేరాడు.

"ఇంకా నయం. అప్పుడప్పుడు యింకా మాటలు విన్నాను గాను. ప్రమోషన్ మాట అటుంచి వున్న వుద్యోగం ఊడిపోయేది. ఇంతకీ మన పేరు బయటపడే అవకాశం లేదు."

కన్నయ్య నెమ్మదిగా నడవసాగాడు. నిద్ర ముంచుకువస్తున్నది. హఠాత్తుగా కన్నయ్య నిద్రమైకం వదిలిపోయింది. జాగ్రత్తగా చూశాడు. అప్పుడే తను విలాసరావుగారి మేడ దగ్గరకు వచ్చాడు. జనం గుంపులు గుంపులుగా చేరుకుని గుమిగూడి వున్నారు. కన్నయ్య గబగబ జనాన్ని త్రోసుకుంటూ లోపలికి పోతున్నాడు.

"ఏమయిందండి విలాసరావుగారూ! అసలు సంగతి ఏమిటి?" ఎవరో గుంపులోనించి అడిగారు.

మధ్యనుంచి మరోకంఠం జవాబిచ్చింది. "ఏమయిందేమిటండి? పదిహేనువందల రూపాయలండీ? బీరువాలో సాయంత్రం పెట్టాను. పావుగంట ముందు మెలకువ వచ్చిందండి. చూద్దును గదా బీరువా తలుపులు బార్లా తీసివున్నాయి."

అందులోంచి అంతడబ్బూ ఖర్చయిపోయిం దంట. ప్రక్కని సాకోటు పెట్టుకుంటే అదీ మాయమయింది."

కన్నయ్య తల తిరిగిపోయింది. నెమ్మదిగా వెనక్కివచ్చి సందులో పడిపోసాగాడు. ఐతే తనకి చిక్కిందెవరు? ఆ దొంగ వెధవేనా? ఎంత నాటకమాడాడు?

తనలో ఎవరో వెయ్యిగొంతుకలతో "తెలివి తక్కువ కన్నయ్యా" అని ఒకటే పనిగా అరు స్తున్నారు.

కథానిక

# ఫలహారంమీద ప్రీతి

సత్యమూర్తి

ఆ ఊళ్ళో పెద్ద దేవాలయం వుంది. పెద్దదే కాదు పేరుగలది కూడాను. పంచారామా లలో ఒకటి. విశాలమైన ప్రాకారాలు, కోనేరు, వీటినన్నిటిని మించి అద్భుతమైన తెల్లటి పాలరాతి శివలింగం ఆ గుడిలో ఆకర్ష ణీయమైన దృశ్యం. ఇంత ఘనత కలిగినదైనా ఒక్క లోటు కనబడుతూనే వుంటుంది. ఆ మహా దేవాలయం గ్రామంలో లేదు. గ్రామానికి ఎగువన అంటే ఆమడ మైలు ఎడంగా విశాల ప్రదేశంలో నిర్మింపబడివుంది. తలనెరిసిన పెద్ద వాళ్ళంటారు, "గ్రామం ఆ గుడి చుట్టూరా ఉండేదట. పైలా, కాలువ వచ్చిన తర్వాత కొత్తగా యిక్కడ కట్టుకున్నాము ఇళ్లు" అని. ఇంత దూరం నడిచి వచ్చే శ్రమ ఉంటే ఎంతదూరమైనా కొందరు భక్తులు ప్రతిరోజూ కోనేరులో స్నానంచేసి గుడిగంటలు మ్రోగి స్తూనే ఉంటారు. కాని కార్తీక మాసం, మాఘ మాసాలలో గుడిగంటలు ఎక్కువసార్లు మ్రోగుతుంటాయి. ఆ గంటల మ్రోత సాధించే ఫలితం మాట ఎలావున్నా గంటల చప్పుడు విని ఊరిమొగపల యిండ్లున్న పిల్లలు జట్లుజట్లుగా గుడివైపు పరుగెడతారు. కొబ్బరి ముక్కలు, అరటి పండ్లు యీ బాల భక్తులను ఆహ్వానిస్తూ వుంటాయి. ఆ కొబ్బరి ముక్కలు, అరటి పండ్ల కొరకు పిల్లలు ఆరాట పడడం యీ నాటిది కాదు. కాటికి కాళ్ళు చాచుకు కూర్చున్న ముసలివాళ్లు కూడా గంట మ్రోతవిని "మా చిన్నతనంలో గంట టంగు మనేప్పటికి చెంగున గంతువేసి గుడిలో ప్రవే శించే వాళ్ళం" అని తృప్తికి తెచ్చుకుంటూ ఉంటారు.

ప్రకాశం కలిగున్న వాళ్ళబిడ్డ. అయినంత మాత్రాన కొబ్బరి ముక్కలు, అరటి పండ్లు ప్రకాశాన్ని ఆహ్వానించలేవని కాదు. అతకు కులభేదాలు అర్థభేదాలు వుండవు. చిన్నతనంలో బాల్యచేష్టలు అనే పేరిట ఒక వ్యక్తి వ్యక్తిత్వం అవకాశాన్ని సృష్టించుకొంటుంది. అట్లాంటి భావిస్వభావ సూచనలు ప్రకాశంలోనూ చూడొచ్చు.

ప్రకాశానికి మాఘ శనివారం పూర్తిగా సెలవురోజు. మాఘ శనివారంనాడు గుడిలో భక్తుల సంఖ్య హెచ్చుతుంది. దాంతో కొబ్బరి ముక్కలు, అరటి పండ్లు గుట్టలు పడతాయి. ఆ రోజంతా ఊరి పిల్లలు దేవాలయ ప్రాంగ ణంలోనే ఉంటారు. ప్రకాశం రాత్రి పడు కుంటూనే అనుకున్నాడు. "రేపు తెల్లవార ఝామునే లేచి ముందుగా ప్రయాణమై గుడికి పోతే కావలసినంత ఫలహారం తెచ్చుకోవచ్చు. ఏమాత్రం ఆలస్యమైనా శనివారం సెలవు మూలాన్ని ఆడపిల్లలు, మగాళ్లు అంతా జట్లు జట్లుగా వచ్చేస్తారు. అప్పుడు ఫలహారం కాకెం గిలి చేస్తేగాని పంచుకతినడానికి వలనుపడదు. నేను లేచేప్పటికి ఒక్క ముసలి తాత మాత్రం మూలుగుతూ మెలకువగా ఉంటాడు. నే లేచి నట్లు పసికట్టినా "ఎక్కడికిరా వెడుతున్నావు పుస్తకం తెచ్చుకొని చదువుకోరాదూ"

అంటాడు. ఇక కోతిపుందు బ్రహ్మరాక్షసి అవుతుంది. అమ్మా నాన్నా అంతా తెలుసు కుంటారు. నా ప్రయాణం ఆగిపోతుంది. చప్పుడు చేయకుండా లేచి బయటికి పోవాలి. లేదా తాతయ్య పలకరిస్తే దొడ్లోకి వెళుతు న్నానని వంకపెట్టి మెల్లగా చల్లగా జారుకో వాలి. చలి జోరుగా వుంటుంది. ఉదయం దుప్పటి పట్టుకెడితే నాన్న వచ్చిన తర్వాత తిడతారు. ఎంత జాగ్రత్తగా వున్నా ఏ అంటి పండు కనో, ముఖ్యంగా పనిబూని అయితీరు తుంది. ఇది కనిపెట్టి అమ్మ నాన్నతో పుల్ల జోడించి చెబుతుంది. దాంతో నా వీపు బద్ద లౌతుంది. అంచేత దుప్పటి మానేసి తాతయ్య అంగవస్త్రం చెవులకు కట్టుకుంటే మంచిది. చలికాలం ప్రొద్దుటే కాళ్ళకు రాళ్ళు ముళ్ళు గుచ్చుకున్నట్లు గుచ్చుకుంటాయి. నాన్నకొన్న జోడు వేసుకవెడితే మంచిదే కాని నడిలో మరచిపోతానేమోనని భయం. పైగా పూజా రాయన మాటాడంటే "గుడిలోకి జోళ్ళు తెచ్చావురా!" అని తడిచేత్తో గదుముతాడు. ఆ బాధ భరించడం మహాకష్టం. అందుకని జోడు పట్టుకెళ్ళడమే మానెయ్యనా? ఆఁ! ఎందుకు? మా మేనత్తకొడుకు సీతారాజున్నాడు కదూ, వాడి జోడు పట్టుకెళ్ళడం మంచిది. వాడు చూస్తే మంచివాడు కాదుగాని తెల్లవారంగానే ప్రయాణం గనక వాడి కంట్లో కారం కొట్టొచ్చు. జోడు మరచిపోయినా, మాయ మయిపోయినా అంత యిబ్బందుండదు. ఇంటి ప్రక్క మహాలక్ష్మమ్మగారు సాయంత్రం కొడుకు చేత పెద్ద అత్తెలం అంటిపండ్లు తెప్పించింది. అవన్నీ దేవునికోసట. ఆవిడ లేచినప్పుడు లేచి కూడా బయల్దేరాలి. మహాలక్ష్మమ్మగారి పిల్లాడు నాతోటివాడే "రాము" చచ్చిపోయి సంవత్సరమైంది. "రాము" పేరుచెప్పి కనీసం ఐదుపండ్లయినా ముందు నాకు పెట్టకపోతుందా." అని ఆలోచించుకొని ప్రకాశం ప్రకృతి నిశ్శ బ్దాన్ని భరించలేక చలేస్తూంటే దుప్పటిలో ముసుగుపెట్టి ప్రయత్నపూర్వకంగా నిద్ర పోయాడు.

రాత్రి కార్యక్రమం నిర్ణయించుకొంటూ చాలసేపు మెలకువగావున్న మూలాన్ని ప్రకా శం మేలుకొనేప్పటికి తెల్లటి వెలుగు వచ్చింది. కంగారుగా లేచి ఆవులించబోయాడు. కాని చప్పుడు తాతకు వినిపిస్తుందేమోనని మానే శాడు. మెల్లగా లేచి చల్లగా అవతలకు జారు కున్నాడుగాని ఒక్క అసంతృప్తి మాత్రం ప్రకాశాన్ని వేధిస్తోంది. ప్రకాశం పినతల్లి కొడుకు చిట్టిబాబు, మేనత్తకొడుకు సీతారాజు ఒక్క మంచంమీదే పడుకున్నారు. సీతారాజు పొట్టి వేదాంతి వాణ్ణి వెనకూడా నడిచి తీసుకు వెళ్ళడం ప్రకాశానికి యిష్టంలేదు. ఇక చిట్టి బాబు చాలా మంచివాడు. వాళ్ళ ఊరువెళితే ప్రకాశానికి "[illegible]" కొనిపెడతాడు. ఎక్కడకు వెళితే అక్కడకు కూడా తీసుక వెడ తాడు. చిట్టిబాబును మెల్లగా లేపి తనతో తీసుకవెళ్ళాలని బుద్ధి పుట్టింది. అందుకోసమని ప్రకాశం నెమ్మదిగా యింట్లోకి వెళ్ళాడు. చిన్న [illegible] సీతారాజు [illegible] కొంగా మంచంమీద కదులుతున్నాడు. అది చూచి ప్రకాశం పడుకని [illegible].

ప్రకాశం [illegible] మగాళ్ళు తడికట్టులలో తిరుగుతున్నారు. ఇక ప్రకాశం దుప్పటి పడుకపెట్టి ముందుకు సాగి పోయాడు. గుడికి సమీపంలో చింతచెట్టు క్రింద ఓ విగ్రహముంది. ఆ విగ్రహం వంక ఎవరూ చూడరుగాని ధనుర్మాసంలోనూ, కార్తీక మాసంలోనూ ఆ విగ్రహానికి కూడా అంటి పండు ముక్కలు నోట్లో వుంటాయి. ప్రకాశం ఆ విగ్రహం దాపునుండే వెళ్ళకుండా ఆ అరటిపండు ముక్కలతన్ని ఆహ్వానించ లేక పోయినై దానికి కారణాలు చాలా వున్నై. ప్రకాశం యింకా ముఖం కడుక్కోలేదు. పైగా మహాలక్ష్మమ్మ పెద్ద అత్తెలం అరటిపండ్లు పట్టుకొని ముందు వెళుతూంది. అలాంటప్పుడు ఈ ముక్కలకోసం కక్కుర్తిపడమని ఎక్క డుంది? అందుకని ప్రకాశం గబగబా గుళ్ళో ప్రవేశించాడు. అదంగళ్లో అత్తెలం అరటి పండ్లు తెచ్చింది మహాలక్ష్మమ్మ ఒక్కర్తే. అందు కని ప్రకాశం ఆమెకూడానే వుంటూవచ్చాడు. ఆవిడ ప్రకాశాన్ని చూసిందిగాని పలుకరించ లేదు. అయినా తనతో మాట్లాడుతున్నట్లు పైవాళ్ళు చూస్తే ప్రకాశం మహాలక్ష్మమ్మకు

సన్నిహితుడని తలంచడానికి వీలుగా దాపునే ఉంటున్నాడు ప్రకాశం.

మహాలక్ష్మమ్మ మొహం కడుక్కోడానికని కోనేరు వైపుకు వెళ్లింది. ప్రకాశం కూడా గుడిలో మామిడి పుల్లొకటి విరుచుకొని ముఖం కడుక్కోడానికి ఉద్యుక్తుడయ్యాడు. "ఏమబ్బాయి యిలా వచ్చావు ప్రొద్దున్నేను?" అని కదలేసింది మహాలక్ష్మమ్మ ప్రకాశంవంక చూస్తూ. "మాఘ శనివారం సెలవుకదాండి" అన్నాడు ప్రకాశం అభినయిస్తూ.

"అప్పుడుగాని ప్రకాశం, నిన్న మీ మేనత్త కొడుకు వీర్రాజు ఏమిటి గురువుగా మోసుక వస్తున్నాడు?"

"ఏమీలేదండీ, నిన్న సెకండు వాడు వాళ్ల ఊరినుంచి వచ్చేడు? వచ్చేటప్పుడు చెరుకు ముక్కలు పట్టుకొచ్చాడండి."

"మరేమీ లేదులే, ఏమిటో అని అడిగేను అంతే"

"మీకు, సుబ్బమ్మగారికి రెండేసి ముక్కలు యిస్తామన్నది మా అమ్మ. మా నాయనమ్మ ససేమిరా అంది. రాత్రి భోజనాలయ్యాక నేను, మా అమ్మ, నాన్న, చెల్లి ఒక్కొక్కముక్క తీసుకొని తిన్నామండి. మిగిలినవన్నీ వీర్రాజు మా నాయనమ్మ అర్ధరాత్రి వరకూ తింటూనే ఉన్నారండి."

"కువాళ్ళ మాటా, నాయనా చెప్పు? ముసలావిడది పూర్వంనుంచి యిలాంటి బుద్ధే. మీ అమ్మ పురాని కొచ్చిన కొత్తలో ఎన్ని బాధలు పెట్టేదనుకున్నావు? మంచి పెద్దలు ప్రజలు చెప్పుకుంటారు నాయనా."

"ఈ పొట్టివాడు మాత్రం అరగంచుతండి."

"ఏ పొట్టివాడు?"

"నిన్నొచ్చిన వీర్రాజండి."

"వీర్రాజా! మంచిపేరే పెట్టేవు. మీ మామయ్య మరీ పొట్టి."

"నాకు మా నాన్న కొత్త చొక్కా కుట్టించేడనుకోండి. వీర్రాజు వచ్చాడా అంటే ఎలాగోలాగ క్రిందా మీదా పెట్టి మా నాయనమ్మతోటి, తాతయ్యతోటి చెప్పి ఆ చొక్కా తొడిగేసేవరకూ విడిచిపెట్టడు. నేనెప్పుడైనా వాళ్ళ ఊరు వెడితే చచ్చేట్టు పని చేయిస్తారు. ఇక్కడ వీర్రాజును దుకాణం మీదకు వెళ్ళమంటే మా ప్రకాశం ఏమయ్యాడని మా అమ్మ మీదే ఎగుర్కొంటాడు."

"వాళ్ళ చట్టమే అలాంటిది నాయనా! మీ తాత సంతానం మొత్తంలో మీ నాన్న గారొకరు తప్పితే అంతా అలాంటి పక్షే... చూడు బాబూ! యీ చెంబులో కాస్త నీళ్లు అందుకోందూ."

"అలాగేనండి. మా నాయనమ్మ ఏమంటుందో తెలుసునాండి? 'ఏదో మేనమామ యిల్లని చూడడానికి వస్తే వాడే కొరికేదా వీడు దుకాణాలమీదకు పంపించడానికి? వాడు రాకపోతే ఏంచేస్తరు? ఏదో మేమున్నన్నాళ్ళు గాని తరవాత రేపోవ్వరు' అని దొంగ దుఃఖాలు తెచ్చుకొంటుందండి."

ఇంతలో పురోహితుడు జంజం సవరించుకొంటూ "స్నానం చేయించాలేమిటమ్మా" అన్నాడు మహాలక్ష్మమ్మవంక చూస్తూ. మహాలక్ష్మమ్మ నోట్లో నిరు పుక్కిలిస్తోన్న మామూలాన్ని ఔనన్నట్లు ఊపింది. "గంగా కానివ్వాలమ్మా" అంటూ అందుకున్నాడు బ్రాహ్మడు.

స్నానం కాస్తా పూర్తయింది. తల విడదీసుకొని మెట్లెక్కడం ప్రారంభించింది మహాలక్ష్మమ్మ. ఇంతకుముందే లోపల కూర్చున్న ప్రకాశం ఆవిడ్ని చూచి ఎవరో అనుకున్నాడు గాని నిలకడమీద ఆనవాలు పట్టి చేతిలో అత్తెలం చూచి చిరునవ్వు నవ్వేడు. గుడిలో మూలవిరాట్టు శివలింగమైనా చుట్టూరా వందల కొలది చిన్న చిన్న విగ్రహాలున్నై. ప్రతిరోజూ వచ్చిపోయే భక్తులు యీ విగ్రహాలన్నింటినీ పూజించరుగాని మాఘమాసంలోనూ, కార్తీక మాసంలోనూ సంవత్సరానికి రెండుసార్లు వచ్చే ఆడంగులు ముఖ్యంగా పూజిస్తూంటారు. మహాలక్ష్మమ్మ అత్తెలం పట్టుకొని ముందు బాలా త్రిపురసుందరిని దర్శించి పళ్లెంలో డబ్బూ పళ్ళూ పెట్టింది. పూజారినడిగి కాస్త కుంకం కూడా పుచ్చుకొంది. పూజారికి తెలియక ప్రకాశంమీద కూడా శఠగోపం పెడుతూంటే మా పిల్లాడుకాడు అంది మహాలక్ష్మమ్మ నిర్మొహమాటంగా. ప్రకాశానికి మండుకొచ్చింది గాని "శఠగోపం నాకెందుకు? అరటిపండ్లు

ముఖ్యం గావి" అని సర్దిచెప్పుకొని సంతోషించాడు. ఇక మహాలక్ష్మమ్మగారి వడిలో అరటి పండ్లు వేసుకొని వరుసగా విఘ్నేశ్వరుడికి, సూర్యనారాయణమూర్తికి, సప్తమహర్షులకు. సరస్వతీదేవికి ... నమస్కరించి ఒకొక్క పండు చిదిమి పెట్టడం ప్రారంభించింది. పై విగ్రహాల దగ్గర పూజారి ఉండడు. అందుకని యీ విగ్రహాలకు ఎవరైనా కొత్త అరటిపండు ముక్క చిదిమి రాస్తూ ఉంటారు. మొట్టమొదట ప్రకాశం ఆ చిదిమిన ముక్కలు తీసుకుందామనుకున్నాడు గాని మళ్ళీ ఎందుకు యింకా అరటిపండ్లు చాలా ఉన్నాయి కదా అని ఆతృత చల్లార్చుకొన్నాడు. సరస్వతీదేవి దగ్గరకు వెళ్ళినప్పుడు "తల్లీ నిన్ను తలంచి ..." అని లోపల ప్రార్థించాడు. ఇలా రామలింగేశ్వర స్వామి, కుమారస్వామి, సుబ్రమణ్యేశ్వర స్వామి.. అంతా అయిపోయారు. ఇక మహాలక్ష్మమ్మ దగ్గర అరటిపండ్లు అయిపోవచ్చినై. ప్రకాశానికి ఆతృత ఎక్కువైంది. ఎటూ పాలుపోక తొందరపడుతున్నాడు. ఎండెక్కిపోతోంది. వాళ్ళనాన్న యీపాటికి యింటికి వచ్చేస్తాడు. అందుకని ప్రకాశం కంగారు పడుతున్నాడు. మహాలక్ష్మమ్మగారు శనేశ్వర స్వామి విగ్రహం సమీపించి అరటిపండు చిదిమి ఆయనకు కూడా కొత్త రాసింది. నమస్కారం పెట్టి ముందుకు సాగిపోయింది. ప్రకాశం ఉండబట్టలేక శనేశ్వరునకు చిదిమి పెట్టిన అరటిపండుముక్క తీసి నోట్లో పెట్టుకోబోయాడు. నూనె, కుంకం అంటుకున్నాయి గాబోలు నోరు అదోలా అయిపోయి ఆముదం తాగినవాడిలా తుపుక్కున ఉమ్మి వేశాడు. ఇదెక్కడ జూశాడో పూజారి "గుళ్ళో ఉమ్మేస్తావురా" అని పెద్ద కేక పెట్టేడు. ప్రకాశం గబగబా చొక్కాతో మూతి తుడుచుకొని అవతలకు పారిపోయాడు.

"మా నాయనమ్మ కంటే మహాలక్ష్మమ్మ మంచిదిలా తీపికబుర్లు చెప్పింది సుంసు. మా నాయనమ్మే నయం ఏదైనా తింటూన్నప్పుడు దగ్గరుంటే కొద్దో గొప్పో రాల్చుతుంది. అందుకే యిలాంటిది మూలాన్నే నా తోటి వాడు "రాము" చచ్చేడు. పోనీ వాడి పేరు చెప్పి ఒక్కపండైనా పెట్టిందా? మొట్టమొదటే పూజారాయన శఠగోపం నెత్తిమీద పెట్టుతూంటే తనదేదో పడిపోయినట్లు "మాపిల్లాడు కాద"ని తిప్పుకుంది. అప్పుడైనా యింటికి పోతానుకొను. ఇపాటికి మా నాన్న వస్తారు. ఏమంటారో! మొన్న హరికథ దాసుగారు చెప్పేరు చిన్నపిల్లలు భగవంతునితో సమానమని. నన్ను ఎరుకుండా పెట్టుకొని దేవుడికి పెడితే మాత్రం [illegible] పుణ్యం వస్తుందా?" అనుకుంటూంటే ప్రకాశం [illegible] గాడుకు వీర్రాజు ఎదురొచ్చ్యాడు. "ప్రొద్దుటే ఎవరినీ లేపకుండా పోయావు బాగా తిన్నావా?" అంటూ.

వాషింగ్టన్, సెప్టెంబరు 19–అమెరికా చతుర్థసూత్ర ప్రణాళిక క్రింద విదేశాలకు సాంకేతిక సహాయ కార్యక్రమ సందర్భంలో, అమెరికాలో శిక్షణ ముగించుకొన్న 14 మంది సాంకేతిక నిపుణులు దూరప్రాచ్యంలోని 5 దేశాలకు వెళ్ళనున్నారని అమెరికా విదేశాంగ శాఖ ప్రకటించింది. ఆ దేశాల ప్రజల ఆచారాలు, భాష, కట్టుబాట్లు మొదలైన విషయాలలో వారికి అమెరికాలో మూడు వారాలపాటు శిక్షణ ఇచ్చారు. వారి వెంట వస్తున్న వారి భార్యలకుకూడ ఆ శిక్షణ ఇచ్చారు. ఆ పధ్నాలుగుమందిలోను ఇరాన్‌కు 7 గురు, లైబీరియాకు 4 గురు, ఇండియా, సింహళం, లెబనాన్ దేశాలకు ఒక్కొక్కరు వెళ్ళనున్నారు.

ఇండియాకు వెళ్ళనున్న డాక్టర్ హారి హైమన్ అమెరికా కార్మికశాఖలో పనిచేస్తున్నారు. ఇండియాలోని కార్మికుల ఆరోగ్యం విషయమై ఆయన కృషి చేస్తారు. ఆయన అమెరికా ప్రజారోగ్యశాఖలో లెఫ్టనెంట్ కర్నల్ హోదాలో ఉన్నారు. ఆయనతో ఆయన సతీమణికూడ ఇండియాకు వెళ్ళనున్నది.

# గిరీశంగారి ప్రజాసేవ పార్టీ

మునగపాటి శేషాచలపతి

ఈ నెల 12వ తేదీన శ్రీ గిరీశంగారి అధ్యక్షత తన మధురవాణి పురంలో శ్రీ బారిష్టరు పార్వతీశం, శ్రీ నాయుడుబావ, శ్రీమతులు బుచ్చమ్మ, ఎం.కి, కాంతంగార్లు సమావేశమై యీ పార్టీని యేర్పాటుజేశారు. ఈ పార్టీ కేంద్రకార్యవర్గంగా శ్రీ గిరీశం, శ్రీ బారిష్టరు పార్వతీశం, శ్రీ నాయుడుబావ శ్రీమతి కాంతం గార్లు ఏకగ్రీవంగా నిర్ణయించబడ్డారు. కార్యదర్శిగా శ్రీ జంఘాలశాస్త్రి నియమింపబడ్డారు.

ఈ పార్టీ కార్యాలయం సాధ్యమైనంత త్వరలో "బుచ్చమ్మనగరం"లో నిర్మింపబడుతుందట. ఈ పార్టీ అఖిల భారత ప్రతిపక్షంగా వుండే అవకాశం కూడ వుందట.

ఇటీవల నాయుడుపేటలో జరిగిన అభిమానుల సభలో అధ్యక్షులు శ్రీ గిరీశంగారు యీ విధంగా వుపన్యసించారు.

* * *

ఇంతవరకు దేశంలో 28 పార్టీలు వున్నా, యీ పార్టీ స్థాపనకుకూడ అవకాశం వుందంటే, దేశంలో పరిస్థితులు ఏవిధంగా వున్నవో, బుద్ధిగల ప్రతి మనిషికీ తెలుస్తూనే వుంది. ఇంతవరకు వున్న పార్టీలలో, సాంఘికాభ్యుదయంగాని, నాటక సినిమా కళలను గురించిగాని, కాఫీహోటళ్ళ సంస్కరణలను గురించిగాని విస్పష్టమైన ప్రణాళికలు లేవు. ఇదియే యీ పార్టీ ప్రత్యేకత. ఈ పార్టీ నిరుద్యోగ సమస్యనుగురించి [illegible] సంతానాన్ని గురించి, ఇంకా యిత[illegible] సిస్సు విషయాలను గురించి తీవ్రంగా కృషి చేస్తుంది.

ఆహార సమస్య, వస్త్రసమస్య, కంట్రోళ్ళ విషయం మున్నగు వాటినిగురించి గొప్ప పరిశోధనలుచేసి, వాటిని తృటిలో నివారించి దేశసౌభాగ్యాన్ని పెంపొందించటానికి తగిన నిర్దుష్టమైన ప్రణాళిక ఏర్పరచింది. శక్తికొలది, అన్నివిధాల ప్రజలకు సేవచేయడమే మా పార్టీ ఆదర్శం, ఆశయం. ఇటీవల స్థాపింపబడిన పక్షాలలో యింతవరకు యింత పెద్ద పార్టీ లేదు. ఈ పార్టీ ముఖ్య ప్రతిపక్షంగా వుండటానికి తగిన అవకాశం వుంది.

ఆంధ్రలో యీ పార్టీకి చాల బలం వుంది. అప్పుడే వేలకువేలుగా యీ పార్టీలో చేరుతున్నారు. ఆంధ్రలో అఖండ విజయం యీ పార్టీకే! బెంగాలులో ఓట్ల బలం సమానంగా వుండొచ్చు, లేక మెజారిటీ రావచ్చు. బొంబాయి, సంయుక్త రాష్ట్రాలు, మధ్య రాష్ట్రాలలో అప్పుడే శాఖలు నిర్మింపబడుతున్నవి. అక్కడ కూడ మాపార్టీకే విజయం చేకూరే చిహ్నాలు కనుపిస్తున్నవి. నిరాశాలకుగాను [illegible]జిల్లాల్లో బయలుదేరి, అన్ని ప్రాంతాలలో పర్యటన జరుపాలనుకొంటున్నాం. ముఖ్యంగా ఆంధ్ర ప్రజలు మా పార్టీమీద ప్రత్యేకాభిమానంవుంచి బలపరుస్తారని ఆశించుతున్నాం.

మా పార్టీ వున్నతాశయాలతో, అభ్యుదయ భావాలతో, పురోగమదృష్టితో నిర్మింపబడింది. మా ప్రణాళికలోని ప్రతి అంశంలోనూ, పైన పేర్కొనబడిన గంభీరోన్నత భావాలు ప్రస్ఫుటంగా విశదమవుతివి.

ఆహార సమస్య: దీన్ని గురించి మా ప్రణాళికలో విశదంగా చెప్పబడి వుంది. మేము సూచించిన పరిష్కార మార్గం యింతవరకు ఏ పార్టీ సూచించలేదు. ఇక సూచించలేదు కూడ. అన్ని పార్టీలవాళ్ళు అనేదేమిటంటే దేశంలో వ్యాపారపంటలు తీసివేసి, దానికి బదులు ఆహార ధాన్యాలను పండించమని. అంటే వీరికి "ఎకనమిక్స్" అనే పదం కూడా తెలియదన్నమాట. ఎందువల్లనంటే దేశంలో వ్యాపార పంటలు తీసివేస్తే ప్రజ డబ్బులేక బాధపడుతుంది. అంటే ఆర్థికమాంద్యం కలుగుతుంది కాబట్టి ఆ పద్ధతికి మేమంగీకరించం.

దేశంలో యీనాడు ముఖ్యంగా ఆహార సమస్యను పరిష్కరించేవి కాఫీ హోటళ్ళు. ఒక

నాలుగుయిడ్లీలు, ఒక కప్పుకాఫీ త్రాగితే మనం ఒకపూట అన్నం మానివేస్తాం. పూర్తిగా ఆహారానికి కాఫీ హోటళ్ళమీద ఆధారపడమని మా పార్టీ చెప్పదు. ఒక పూట ఆహారం కాఫీ హోటళ్ళ వలన సమకూరుతుంది. రెండో పూట ధాన్యం ఆహారం. ఈవిధంగాచేస్తే ఆహార సమస్య చిటికెలో పరిష్కారమవుతుంది. ఇంక మిగులు ధాన్యాన్ని విదేశాలకు ఎగుమతి చేసి, అధిక ధరలకమ్మి లాభాలు పొందవచ్చు. కోట్లు ఖర్చుపెట్టి పెద్దపెద్ద ప్రాజెక్టులు కట్టనవసరం లేదు. మున్షీగారు చెప్పినట్లుగా చేపలు తిన నవసరంలేదు. రాజాజీ చెప్పినట్లుగా గడ్డి తిన నవసరంలేదు ఈ విధంగా ఆహార సమస్యా పరిష్కారానికు మా పార్టీ పూనుకొన్నది.

వస్త్ర సమస్య: శ్రీమతులు బుచ్చమ్మ, కాంతం, ఎంకి గార్లు, ఒక కమిటీగా ఏర్పడి వస్త్ర సమస్యను గురించి ఒక సమగ్ర నివేదికను సమర్పించారు. దాని ప్రకారం మనం వస్త్ర సమస్యను గురించి విచారించవలసిన పనివుండదు. మన హాలీవుడ్ సినిమా సంస్కృతి, సాంఘిక నాటకాభ్యున్నతి పెరిగి పెద్దవవుతున్న యీ రోజులలో వస్త్ర సమస్య దానంతటదే పరిష్కారమయ్యే మార్గమున్నదన్న మాట. ఫ్యాషన్లు పెరిగి, నాగరికత హెచ్చినకొద్దీ మన స్త్రీల దుస్తులు కూడ, మన మార్గదర్శకులు తెల్లవారి ప్రకారం లాగులలోకి, గౌన్లలోకి దిగినవి. మన పురుషుల దుస్తులు కూడా అదేవిధంగా, అంటే గౌన్లకు బదులు చొక్కాలు. ఈ విధంగా మనదేశంలో మన స్త్రీ పురుషులకు లాగులు, గౌన్లు, లాగులు, చొక్కాలు నిర్బంధంగా నిర్ణయిస్తే గుడ్డ కావలసినది చాలా తగ్గుతుంది. ఇప్పటి లెక్క ప్రకారం స్త్రీకి ఏడు గజాల చీర కావాలి. లాగుకే అయితే మూడుగజాలు చాలు. అంటే నాలుగు గజాల గుడ్డ ఆదా అన్నమాట.

ఇక పురుషుడి సంగతి చూడండి. ఏడు గజాల ధోవతులు కావాలి. లాగులయితే మూడు గజాలు చాలు. అంటే వీరికి కూడ నాలుగు గజాల గుడ్డ ఆదా అన్నమాట. ఇక గౌన్లు, చొక్కాలకు గుడ్డ మామూలే అనుకోండి. అదిగాక ఈ చొక్కా, గౌన్ల పద్ధతి చాల అందంగా, నాగరికతగా వుంటుంది. ఈ రకంగా చేస్తే మన వస్త్ర సమస్య పరిష్కారమవడమే కాక, మన మిల్లులలో తయారయే గుడ్డ చాల మిగులుతుంది. విదేశాలకు ఎగుమతి చేసి, చాల లాభం పొందవచ్చు.

కంట్రోళ్లు: దీనినిగురించి మా పార్టీ నాయకులు అనేక పరిష్కార మార్గాలను సూచించారు. అయితే యీక్రింద చెప్పబడిన పద్ధతే అందరిచే యేకగ్రీవంగా నిర్ణయింపబడింది. కంట్రోల్సు వుంటే సరుకు దొరకదు. ఎత్తివేస్తే అధిక ధరలు. కావున దీనికి మధ్యమార్గం ఏమిటంటే ఒక్కొక్క పూట కంట్రోల్సు వుంచాలి. మరొకప్పుడు ఎత్తివేయాలి. ఇది అంతా వ్యాపారస్థులు గ్రహించకుండా అకస్మాత్తుగా జరగాలన్నమాట. ఇట్లాచేస్తే ధరలు పెరగవు. సరుకు దొరకకుండా పోదు. దీనివల్ల ప్రజలకు చాలా లాభం చేకూరుతుంది.

విదేశాంగ విధానం: మా పార్టీ విదేశాంగ విధానం చాల శ్రద్ధతో ఆలోచించి నిర్ణయింపబడింది. మా పార్టీ సోషలిస్టులు వాంఛించినట్లు ప్రపంచంలో తృతీయ కూటాన్ని నెలకొల్పుతుంది. కమ్యూనిస్టులు చెప్పినట్లు సోవియట్ కూటంలో చేరుటకు పూనుకుంది. ఇంకా కొంత మంది కోరినట్లు ఆంగ్లో-అమెరికన్ కూటంతో ఒడంబడిక చేసుకొంటుంది. ఈ రకంగా, యే కూటంలో వున్నా, ఆత్మ స్వాతంత్ర్యాన్ని కోల్పోదు. అంటే ప్రతివారికీ నచ్చే విధంగా ప్రయత్నిస్తుందన్న మాట.

దేశరక్షణ: దేశమునకు, దేశ రక్షణకు, ఎంత సైన్యము వుండవలయును, యింకను యితర సైనిక విషయములు, పరిష్కార మార్గములు సూచించుటకు శ్రీ నరసింహారావుగారి అధ్యక్షత క్రింద ఒక సంఘం నియమింపబడింది. నివేదిక త్వరలో రావచ్చు.

భూసంస్కరణలు: మా పార్టీ భూసంస్కరణలను గూర్చి మహోన్నతమయిన రిపోర్టును ప్రచురించింది. (గిరీశం బుచ్చమ్మ రిపోర్టు) ఈ రిపోర్టు ప్రకారం 'దున్నేవానిదే భూమి', 'ఉతికేవానిదే బట్ట' అన్న సిద్ధాంతం ప్రచారంలోకి వస్తుంది. ఈ సిద్ధాంతం వలన ప్రతివారు కష్టపడవలెనని తెలుస్తూనే వుంది.

సాంఘిక సంస్కరణలు: 'సాంఘిక సంస్కరణల'నే గ్రంథాన్ని యిటీవల శ్రీ బారిష్టరు పార్వతీశంగారు ఇంగ్లండులోని అనుభవాలను పురస్కరించుకొని, ఇండియాలోని సాంఘిక సమస్యలకు సమన్వయించి రచించారు. ఈ గ్రంథం ప్రకారం సాంఘిక సమస్యలు పరిష్కారమౌతవి. ఈ పుస్తకంలో ప్రధానోద్దేశమేమిటంటే, సంఘంలోని ప్రతివారు తమ యిష్టం వచ్చినట్లుగా ప్రవర్తించవచ్చు, సంచరించవచ్చు, అంటే పరస్పరప్రేమే ప్రధానమన్నమాట. అయితే విడాకులుండవు. పూర్తి వివరాలు కావలసినవారు పైన పేర్కొనబడిన గ్రంథాన్ని చదవండి.

నాటకకళ, సినిమాలు: దీన్ని గురించి శ్రీ జంధ్యాల శాస్త్రిగారు మాడ్గుల శాస్త్రిగారి సహాయంతో 'నేటి మన కళ' అనే గ్రంథరాజాన్ని ప్రకటించారు. ఈ గ్రంథాన్నిబట్టి సమస్యా పరిష్కార మార్గాలు నిర్వచింపబడుతవి. దీని ముఖ్యోద్దేశమేమిటంటే అన్నిరకాల నాటకాలు (వీధి భాగవతాలతోసహా) సినిమాలు జాతీయం చేయబడాలన్నమాట. ఇట్లు జాతీయం చేయడం వలన నిరుద్యోగ సమస్య దానంతటదే పరిష్కరింప బడుతుంది. జాతీయం చేయబడినా, కొన్ని ప్రత్యేక సౌకర్యాలను కొన్ని కంపెనీలకు, కలిగింపబడుతవి. ఇంకా వివరాలు కావలసిన వారు పైన చెప్పిన గ్రంథాన్ని చదవడ మంచిది.

భాషాప్రయుక్త రాష్ట్రాలు: దీన్ని గురించి మా పార్టీ అనేక తీర్మానాల నామోదించింది. ఈ తీర్మానాల సారాంశమేమిటంటే, నాగరికత, సంస్కృతి, వున్నతాశయాలు, సౌభ్రాతృత్వము నానాటికి పెంపొందుతున్న యీ రోజులలో భాషాప్రయుక్త రాష్ట్రాలు అపకారం; అనవసరం కూడ. భాషా రాష్ట్ర నిర్మాణంవలన సంకుచితత్వం రెచ్చగొట్టబడుతుందనే ఆశావాదులతో, నిరాశావాదులతో సంపూర్ణంగా ఏకీభవించం. కావున సమయానుకూలాలోచించి, పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, భాషా రాష్ట్ర నిర్మాణానికి మా పార్టీ పూనుకొంటుంది. దీన్నిగురించి మా పార్టీ తయారు చేసిన రిపోర్టు "గిరీశ నిలయం"లో దొరుకుతుంది. వలయువారు చూడవచ్చు.

ఇంకా అనేక సమస్యలను గురించి, అభ్యుదయ భావాలతో, ప్రగతికి అనువైన విధంగా సమగ్రమయిన రిపోర్టులు, నివేదికలు తయారు చేసి, పుస్తకాలనుగూడా ప్రకటించివున్నాము. ఇవన్నీ మా పార్టీ కార్యక్రమాన్ని గురించి కూలంకషంగా తెలుసుకోవడానికి సహకరించుతవి. కావున అభ్యుదయ పురోగాములైన ప్రతి వ్యక్తి, ప్రజాసేవే పరమాదర్శంగా పెట్టుకొన్న ప్రతి ప్రాణి పార్టీలో చేరొచ్చు. చేరినట్టుగానే భావించుతాం కూడ.

మా పార్టీలో చేర దలచుకొన్నవారు, మా పార్టీ సంబంధమైన పుస్తకాలను చదువ దలచుకొన్నవారు, ఈ క్రింది అడ్రసుకు దయచేసి వ్రాయ ప్రార్థన.

గిరీశ నిలయం,
పార్వతీశం వీథి,
మధురవాణి పురం—6

* * *

శ్రీ గిరీశంగారు, ఆంధ్రదేశానికి పాతిక, ముప్పదిసంవత్సరాలనుండి చిరపరిచితులు. గురుజాడవారు వీరిని ఆంధ్రులకు పరిచయంచేసిన దగ్గర్నుండి, ఆంధ్రప్రజకు వీరిమీద గౌరవాభిమానాలు పెరిగినవి. ఇటీవల గిరీశంగారి వార్తలు ఆంధ్రదేశానికి దూరమైపోయినవి.

వీరు మొన్న అకస్మాత్తుగా విజయవాడ స్టేషనులో కనబడ్డారు. నమస్కరించి యిటీవల తమరు కనబడటం లేదేమని పృచ్ఛజేశాను. బుచ్చమ్మ సమేతంగా అమెరికా, ఇంగ్లండు మున్నగు విదేశాలు పర్యటనజేసి వచ్చారట. ఈ నూతనానుభవంతో, ఆంధ్రదేశంలో నూతన పార్టీని నెలకొల్పినానని చెప్పి, పైన చెప్పిన ఉపన్యాసం ప్రణాళిక వివరాలనిచ్చి వెళ్ళిపోయారు.

---

ప్రతి దేశానికీ దేవుడిమీద నమ్మకం వుంది. ఒక దేశానికి ఇంకొక దేశంమీద నమ్మకమే ఇప్పుడు కావలసినది.

కథానిక

# "చెట్టుకింద ప్లీడరు"

అప్పిచర్ల సుబ్బారావు

రెండు నెలల నుంచి ఖాళీగా వున్న పిచ్చయ్యగారి మధ్యవాటాలోకి పొట్టిగా గుండ్రాయిలా వుండే కిష్టయ్యగారు సకుటుంబ సమేతంగా అద్దెకు చేరారు. పేరు కిష్టయ్యగారైనా ఎందుకోగాని అందరూ ఆయన్ని చెట్టుకింద ప్లీడరని పిలుస్తుంటారు.

ప్లీడర్లు, లాయర్లు, వకీళ్ళు, గాక చెట్టుకింద ప్లీడర్లనే మరొక విభాగం ప్లీడర్ల వంశవృక్షంలో వుందా, అని కొద్దిరోజులపాటు ఆశ్చర్యపడ్డాను. కాని ఆ కిష్టయ్యగారితో స్వయంగా పరిచయమేర్పడ్డాక చెట్టుకింద ప్లీడరంటే యేమిటో అవగాహనయింది. ఇక కథ చెప్పటం దేనికి అంటే నా అమాయకత్వానికి అందరూ నోళ్లు తెరుచుకొని మూడు లోకాలు వినేటట్లు పగలబడతారేమో! కొంచెం ఓపిక పడితే మంచిది. కాళ్లులేని కథైనా కాలక్షేపానికి కొంత వ్యవధి కావాలిగా మరి.

కిష్టయ్యగారు అద్దెకు చేరిన మర్నాడనుకుంటా, ఈజీ చైరులో పడుకొని రిస్టువాచి సరిజేసుకుంటూ పేపరు చదువుతున్నాను. "అబ్బాయ్! టైమెంత?" అని వడివయస్సులో వున్న ఒక కంఠం అడిగింది. పేపరు మడిచి ఎవరా అని చూచాను. "నేనే అడిగింది. టైమెంత?" అని ఎదురింటి వాకిట్లో నిలబడి ఒకాయన ప్రశ్నించాడు. ఆయనే కిష్టయ్యగారు. టైము చూచి "తొమ్మిదీ ముప్పావుండీ" అని ముక్తసరిగా అన్నాను. "అబ్బో! టైమయింది కోర్టుకు వెళ్ళాలి" అనుకుంటూ గంపెడు కాగితాలు చంకలో వేసుకొని చినిగిన పాతకోటు తగిలించుకొని నస్యం రెండు చిటికెలు పీలుస్తూ నాకేసి ఒక మందహాసం పారేస్తూ కిష్టయ్యగారు కోర్టుకు బయలుదేరారు. అదే కిష్టయ్యగారికీ నాకూ ప్రథమంగా పరిచయమైన ఘట్టం.

వారు నన్ను టైమెంత అని అడిగినప్పుడు మీ పేరేమిటండీ, మీరేం చేస్తున్నారండీ అని అడిగితే రంగు బయట పడుతుందనుకున్నాగాని ముఖపరిచయం కూడా లేని మనిషిని పట్టుకొని యీ ఆరాలన్నీ అడుగుతే బాగుండదని వూరుకున్నా. మరి కాసేపటికి కిష్టయ్యగారింట్లోనుంచి ఒకామె బైటికి వచ్చి నిలబడింది. ఆమెను చూసిన క్షణంలోనే ఆమె కిష్టయ్యగారి భార్యని తెలుసుకోవటానికి నాకెంతో సేపుపట్టలా. ఆమె మాట్లాడానికి అంత అందంగా లేకపోయినా అనాకారి మాత్రం కాదు. ఆమె పవిట చెరగున కట్టిన వక్కపలుకు నోట్లో వేసుకుంటూ "కావమ్మగారూ" అని పిలిచింది.

కావమ్మ అంటే ఎవరో కాదు. మా ఇంటి పక్కన వుండే ఆలిండియా రేడియో. కావమ్మగారు వంటమనిషి. పురాతన కాలంలోనూ, ఆధునిక కాలంలోనూ ఆమెకు తెలీని మంచి చెడ్డలుగాని సంగతి సందర్భాలుగానీ లేవు. ఊళ్ళో ఏవార్త వెలువడ్డా ముందుగా ప్రసారం చేసేది కావమ్మగారే. అందుచేత కావమ్మగారిని మేము ముద్దుగా ఆలిండియా రేడియో అని పిలుచుకోవటం అలవాటు. "కావమ్మగారూ!" అని కిష్టయ్యగారి భార్య పిలిచిందో లేదో "ఆఁ! వస్తున్నా" అని వూడిపోతున్న జుట్టును సుచ్చుటముడి వేసుకుంటూ, పవిట కొంగుదోపుకుంటూ ప్రత్యక్షమయింది కావమ్మ. ఇద్దరూ కాసేపు చెవులు కొరుక్కొని యేం చెప్పుకున్నారో నాకు తెలీదుకాని సమావేశం ఆపి కావమ్మగారు యింటికి వచ్చేటప్పుడు— "మీవారు ఇంకా చెట్టుకింద ప్లీడరు వుద్యోగం చేస్తూనేవున్నారన్నమాట"-అంటూ వచ్చింది.

కావమ్మగారు నాకు తెలీని కొత్తమనిషి కాదు. పరిచయంవల్ల "కావమ్మగారూ! చెట్టుకింద ప్లీడరంటున్నారేమిటి?" అని మెల్లగా అడిగాను.

"ఈ సంగతి నీకింకా తెలీదా అబ్బాయి!" అని ప్రారంభించింది కామమ్మ. "పిచ్చయ్యగారి వాటాలో మొన్నొకాయన అద్దెకు చేరాడు తెలుసా?"

"తెలుసు."

"ఆయన పేరు కిష్టయ్య. ప్రయివేటు చేస్తుంటాడు. అంటే వాళ్ళకూ వీళ్ళకూ లేనిపోని మాటలు చెప్పి తగాదాలు పెట్టటం, పురెక్కించి కోర్టుల కెక్కించటం, యిద్దరికీ జయం అంటూ ఒకరికి తెలియకుండా మరొకరిదగ్గర డబ్బులు కాజేసి పొట్టపోసుకోవటం. ఈ వృత్తి గల పెద్దమనుషు లందర్నీ చెట్టుకింద ప్లీడర్లంటారు. అమ్మో! యిక్కడ కూచుంటే ఎట్లా!" అంటూ లేచిపోయింది కామమ్మ.

చెట్టుకింద ప్లీడరంటే నిర్వచనం చెప్పినందుకు కామమ్మను అభినందించాను మనస్సులో. అప్పుడప్పుడు కిష్టయ్యగారు నన్ను టైం అడగటం, నేను సమాధానం చెప్పటం మామూలయింది. ఆవిధంగా వారికీ నాకూ పరిచయమే గాకుండా స్నేహిత మేర్పడింది. సెలవులు వస్తే, కాసేపు హాయిగా మాట్లాడుకుందాం రాండి అని నేను వారిని పిలవటమో, వారు నన్ను పిలవటమో జరిగేది. సంభాషణ ప్రారంభించిన క్షణంనుంచీ అంతమయ్యే ఆఖరు క్షణం దాకా నేను వూకొట్టటమూ, కిష్టయ్యగారు ధోరణితగ్గకుండా మాట్లాడటమూ మామూలు. మేమిద్దరం ఎప్పుడు కలసి మాట్లాడినా తన స్వానుభవాలూ, ఉద్యోగంలో తన ప్రయోజకత్వాలూ మెరుగులుదిద్ది మేటిగా చెప్పేవాడు. అందువల్ల నేను తెలుసుకోదగ్గ చెట్టుమీద ప్లీడరు విషయం యిట్టే తేలిపోయేది. కిష్టయ్యగారు యెంత కొత్తవాళ్ళకయినా సరే యిట్టే తగాదా పెట్టాడుట. కయ్యం కల్పించి కోర్టు కెక్కిస్తాడుట. ఇది వృత్తిలో నేర్చిన విద్య అంటాడు నవ్వుతూ. ఒకసారి అనుమానం తీర్చుకోటానికై మీరు తగాదాలు ఎలా పెట్టేవారో చెప్తారా అని అడిగాను.

కిష్టయ్యగారు పకపక నవ్వాడు. బహుశా నా అమాయకత్వాన్ని చూచేమో! "చెబుతాను విను" అంటూ కిష్టయ్యగారు ప్రారంభించాడు.

ఎవరో ఇద్దరు వ్యక్తులు. బాగా స్నేహితం లేకపోయినా ముఖ పరిచయ మున్నవారే. ఇద్దరికీ పొట్టకూటికి లేదు. అలాటి వాళ్లిద్దరూ కిష్టయ్యగారి కంట్లోపడ్డారు. సరే, మామూలుగా తన ధోరణి ప్రారంభించి యిద్దరికీ పురెక్కించాడు కిష్టయ్య.

"నాపంటచేలో గొడ్డుపడి నాశనంచేసినయ్. కాబట్టి నాకు నష్టపరిహారం చెల్లించుకోవాలి. అందుకు యిదుగో సాక్షులు" అని దావా వేశాడు వాది. "అబద్ధం, యిదంతా పచ్చిమోసం. వాది నామీద లేనిపోని మాటలంటున్నాడు. అసలు అతని గొడ్లేవచ్చి నా పంటచేను పాడుచేసినయ్. కాబట్టి నష్టపరిహారం క్రింద నాకు వాది వెంటనే సొమ్ము చెల్లించుకోవాలి. ఈ విషయమై కావాలంటే యిదుగో సాక్ష్యాలు" అని బదులు చెప్పాడు ప్రతివాది.

వాదికి జడ్జి ముందు నిజం పలకటానికి అస్కారం లేకపోయింది. అందుచేత నీళ్లు నములుతూ "నాకు గొడ్లు లేవండి. అసలతనికి పొలమే లేదండి" అన్నాడు. ప్రతివాది దణ్ణం పెడుతూ "నాకూ గొడ్లు లేవండి. వాది కసలు పొలం లేదండీ" అన్నాడు. "ఇలా పొలం లేకుండా గొడ్లు లేకుండా యిద్దరు వ్యక్తులు దావాలు వేసుకునే అజ్ఞానంలో వున్నారంటే దీనికంతటికీ మన మహిమే కారణం" అని సగర్వంగా అన్నాడు కిష్టయ్య. తనను అభినందిస్తానని అనుకున్నాడుగాని నేను విని వూరుకునే సరికి చిన్నబుచ్చుకున్నాడు పాపం కిష్టయ్య.

నాలో, ఆనాటినుండీ కిష్టయ్యంటే ఆదరాభిమానాలకి బదులుగా ఏవగింపు, ద్వేషం కలిగాయి. నిద్రలేచిన దగ్గరనుంచీ పడుకోబోయే దాకా కిష్టయ్య చెప్పే మాటలన్నీ అబద్ధాలే! లేనిపోని మాటలే! చేసే పనులన్నీ అఘాయిత్యాలే, అన్యాయాలే!

అన్నదమ్ములకు విభాగాలు, ఆలిమగలకు విడాకులు, తండ్రి కొడుకులకు పోరాటాలు, అత్త కోడళ్లకు వైరాలు క్రమంగా ప్రబలి కోర్టుల కెక్కుతున్నారంటే యిలాటి చెట్టుక్రింద ప్లీడర్ల కలహాలే కారణాలని తెలుసు చేసుకోటానికి నాకు యెంతో సేపు పట్టలేదు.

అలాటి కిష్టయ్యా పిచ్చయ్యాగారింట్లో చేరాడంటే అద్దె సరిగ్గా యిస్తాడా, పేచీ పెట్టకుండా లేచి వెళ్ళమంటే వెళ్తాడా అనే అనుమానం నాకు అనుకోకుండా తగిలింది. పిచ్చయ్యగారికి ముప్పై యేళ్ళుంటాయేగాని మనిషి చాదస్తుడు. ఎవరేమాట చెబితే అది గ్రుడ్డిగా నమ్మే మనిషి. తెల్లవన్నీ పాలు, నల్లవన్నీ నీళ్లు అని నమ్మే అమాయకుడు. ఒకసారి పిచ్చయ్యగారిని పిలిచి అడిగాను. "ఏమండి, కిష్టయ్యగారు పేచీ పెట్టకుండా అద్దెయిస్తారా" అని. "వారికేమండి. నిక్షేపంలాగా యిస్తారు. ఇరవై రూపాయల యింటికి అడక్కుండానే నలభై రూపాయలిస్తున్నారు" అని సంతోష పడ్డాడు పిచ్చయ్య. "అంటే దీనివార ఇంకొక ఎత్తు వేశాడన్నమాటే" అన్నాను. "అబ్బే! కిష్టయ్యవారలాటివారు కాదండీ" అని వెనుక వేసుకువచ్చాడు పిచ్చయ్య. సరే నాకేమని తటస్థంగా వూరుకున్నాను.

కొద్దిరోజులు గడిచాక మ్యునిసిపాలిటీ వాళ్లు యిళ్ళ పన్ను వసూలు చేస్తున్నారు. అప్పుడు యిళ్ళ వాళ్ల దగ్గరవుండే సామాన్యవ్యాధి ఏమిటంటే అద్దెవాళ్ల దగ్గరకు వచ్చి-తక్కువ అద్దె యిస్తున్నామని చెప్పండి అని బ్రతిమలాడతారు. మనకు యిందువల్ల పొయ్యేదేమిటిలే అని సగానికి సగం అద్దె తగ్గించి చెబుతారు అద్దెవాళ్లు. అందువల్ల పన్ను తగ్గుతుంది యింటివాళ్ళకు. అలాగే పిచ్చయ్యగారు కూడా కిష్టయ్యగారి దగ్గరకు వచ్చి, "ఏమండీ! మ్యునిసిపాలిటీ వాళ్లు వస్తున్నారు. అద్దె యిరవై రూపాయలిస్తున్నామని చెప్పండి. మాకు సగం పన్నయినా తగ్గుతుంది." అని అడిగాడు.

"ఓ! దానికేమండీ. కావాలంటే కాగితం మీద కూడా వ్రాసిస్తాను. అది తీసుకవెళ్ళి నేరుగా మ్యునిసిపల్ ఆఫీసులో యిచ్చారంటే మీకు పన్ను చాలా తగ్గుతుంది" అని కిష్టయ్యగారు సలహా చెప్పేసరికి పిచ్చయ్యగారికి కొండెక్కినంత పనయింది. తన కింతకంటే యింకేం కావాలని అనుకుంటూ "అలాగే కాగితం మీద వ్రాసిఇవ్వండీ" అని అడిగాడు. అలా అడగటమే తడవుగా- "నేను పిచ్చయ్యగారిమధ్యవాటాలో వుంటున్నాను. అద్దె పదిరూపాయలు. ఈవిషయం మ్యునిసిపల్ ఆఫీసరుగారు గుర్తించమని మనవి. ఇట్లు-కిష్టయ్య." అని కాగితం వ్రాసి యివ్వటంతోటే ఆ కాగితం తీసుకుపోయి మ్యునిసిపల్ ఆఫీసులో ఇచ్చాడు పిచ్చయ్య. వెంటనే పన్ను నాలుగవ వంతుకు తగ్గించారు. ఈ సహాయం చేసిపెట్టినందుకు కిష్టయ్యను గురించి వూరంతా చెప్పుకొన్నాడు పిచ్చయ్య.

తరువాతి పదిరోజులకు ఒకటో తేదీవచ్చింది. కిష్టయ్యగారు పిచ్చయ్యగారిని పిలిచి మీ అద్దె తీసుకోండి అని పది రూపాయల నోటు చేతికందించాడు. పిచ్చయ్య ఆశ్చర్య పడుతూ, గాభరాగా "ఏమిటిది" అన్నాడు. "అబ్బే! ఏమీ లేదండీ! మీకు మేము అద్దె యివ్వటం పది రూపాయలేగా. కావాలంటే మ్యునిసిపల్ ఆఫీసరుగారి దగ్గర కాగితం చూడరండి" అన్నాడు.

పిచ్చయ్య తల తిరిగిపోయింది. ఈ ముప్పు ముందుగావూహించలేకపోయాడు. "ఇదేమిటండీ కిష్టయ్యగారూ! నలభై రూపాయల అద్దెకు పది రూపాయలిస్తారా" అని గట్టిగా అడిగాడు. "ఆ సంగతులన్నీ నాకేం తెలుస్తాయండీ. మీరే వ్రాయమన్నారుగా పది రూపాయలిస్తున్నట్లు? యిష్టమైతే ఆ పదన్నా దక్కించుకోండి. లేదంటారా యిటుయివ్వండి. చేతనైతే దావా వేసుకోండి. కోర్టుకెక్కుదాం. ఇల్లు కూడా మీరు చెబితే ఖాళీచేయను తెలిసిందా" అని అన్యాయాలకు అలవడ్డ కిష్టయ్యగారు అనేశారు.

పిచ్చయ్యగారికి నిజంగా పిచ్చెత్తినట్లయింది. "కిష్టయ్య దుర్మార్గుడు అద్దె ఎగగొట్టేడు. ఖాళీ చేయనంటున్నాడు. కిరాతకుడు" అని వూరంతా తిరిగి అందరికీ చెప్పాడు.

కిష్టయ్యగారు చెట్టుకిందప్లీడరు. తగాదాలు దావాలు అంటే వృత్తిలో నేర్చుకున్న విద్య. అలాటివాడు యీ అఘాయిత్యానికి పాల్పడ్డాడంటే ఆశ్చర్య పడవలసిన అవసరమేమీలేదు.

అద్దె ఎగగొట్టటమే కాదు. కిష్టయ్య పిచ్చయ్య పట్లచేసిన మరొక ఘోర అన్యాయంవుంది. పిచ్చయ్యకు, అతని అన్నదమ్ములకు ఆస్తి వాటాలలో యిదివరకుతగాదాలు వచ్చినయి. వాటిని నలుగురు పెద్దమనుషులూ సరిచేయటం వల్ల ఆ

తగాదా సమసి పోయింది. ఇప్పుడు తగాదా పుట్టు పూర్వోత్తరాలు తెలిసికోలేక మీ పక్క కేసు గెలుస్తుందనీ, మీకు పిచ్చయ్యగారి వాటా నుంచి భూమి, యిల్లు భాగం వస్తుందనీ కల్పనా శక్తితో పురెక్కించి పిచ్చయ్యకు ప్రతిపక్షంగా వాళ్ళను రెచ్చగొట్టాడు. వాళ్లు ఈయన మాటలు నమ్మి పిచ్చయ్యమీద కారాలు మిరియాలు నూరారు. అద్దె అసలివ్వకండని సపోర్టు చేశారు. దానితో కిష్టయ్య వాళ్ళజుట్టు బాగా అంకించుకున్నాడు. పిచ్చయ్య యిందువల్ల శోకుడై పోయినాడు.

అద్దేమిటి, యీ యిల్లు నాదే అనేదాక వచ్చాడు కిష్టయ్య ప్రతిపక్షానవున్న పిచ్చయ్య సోదరుల అండతో. పిచ్చయ్యకు భుక్తి గడవా లంటే భూమిమీద ఆదాయం, యింటిమీది ఆదాయం. భూమిమీద తిండిగింజలు సంవత్సరానికి ఒకసారి వస్తయ్. వాటికితోడు యింటి అద్దె తెచ్చుకొని మెల్లగా కాపురం చేస్తున్నాడు పిచ్చయ్య.

అలాంటిది అద్దె రాకపోయేసరికి కాపురం గడవాలంటే కష్టంగా వుంది. దానికితోడు అన్నదమ్ములు దావావేశారు తమకు వాటా యింకా రావాలని. నిజం, న్యాయం యేనాటికైనా తనవేనని తెలుసు పిచ్చయ్యకి. కాని అందాకా అష్టకష్టాలు పడాలి. పిచ్చయ్య, అన్నదమ్ముల చేతుల్లో, కిష్టయ్య చేతిలో నానాహింసలూ పడుతున్నాడు.

దావా పడింది. అందరూ కోర్టుకు హాజరైనారు. కిష్టయ్యగారు కుడిభుజంగా ప్రతిపక్షం వైపు నిలబడ్డాడు. కాని న్యాయం సరిగ్గా జరిగింది. నిజం నిక్కచ్చిగా తేలింది. పిచ్చయ్య కేసులో గెల్చాడు. తండ్రి రాసిచ్చిన వీలునామా ప్రకారం అతనికి ఆ వాటా వచ్చింది. "మిగతా కొడుకులకంటే ఎక్కువభాగం పిచ్చయ్యకు యిస్తున్నాను కారణం వాడు మందమతి, బాధస్తుడు గనుక" అని వీలునామాలో వున్న అక్షరాలు నిగనిగ మెరుస్తున్నయ్. ఆ కారణంగా జడ్జి న్యాయం పిచ్చయ్యదేనని బల్లగుద్ది చెప్పాడు. కిష్టయ్య ముఖం వెలవేశాడు. అన్నదమ్ముల తలలు తీసివేసినట్లయినయ్. ఇదివరకటిలాగే అన్యాయంగా దావా వేసి అపరాధానికి వడిగట్టుకున్నందుకు ఫలితంగా విపరీతంగా ప్లీడరు ఫీజులు, కిష్టయ్య ఫీజుకు ఖర్చులు అమితంగా అయినయ్. డబ్బు ఖర్చుకు తోడు పరువు ప్రతిష్ఠలు కూడా మంటగలసినయ్. ఆ అన్నదమ్ములు పిచ్చయ్యని క్షమించమని అడిగారు.

పిచ్చయ్య మందమతయినా కొంచెం దారిన పడ్డాడు. "మనకు కలహాలు తెచ్చిపెట్టింది, అశాంతి కలిగించిందీ ఆ చెట్టుకింద ప్లీడరు కిష్టయ్యగాడు. ముందు ఆయనపని పట్టండ"న్నాడు. వాళ్లూ తప్పకుండ వెంటనే గ్రహించారు. కిష్టయ్య పీకమీద కూచొని అద్దె అంతా వసూలు చేసి యిల్లు ఖాళీచేసిందాకా వదల్లేదు.

# గీతం

ఒక్క చుక్కలో జీవితమంతా
అతి విస్తృతమీ విశ్వారణ్యం
తెలియదు త్రోవ విపత్తులగణ్యం
వలసిందొక ఆధారమనన్యం
అందువల్ల నీ పెరటి తోటలో
ఒక్క మొక్కలో జీవితమంతా.
శతధాభిన్నం ప్రాణదర్పణం
వృథా అవనో! నీ అశ్రుతర్పణం
పూర్ణత కాలపు నిలల కర్పణం
అందువల్ల నిజరూప దర్శికే
ఒక్క చెక్కలో జీవితమంతా.
బిందు నిహితమే సింధు రహస్యం
ఏకంవలన అనేకం వశ్యం
బీజాంతర్గత నైజం శస్యం
అందువల్లనీ నోటిగడపపై
ఒక్క ముక్కలో జీవితమంతా.

—బైరాగి

# కదిలింది కాలరథం

[మంగళ తూర్యారవాలు కొంచెం సేపూ, శంఖధ్వని కొంచెం సేపూ వినబడుతవి.]

ఒకటో స్త్రీ: ఇదేం చోద్యమమ్మా!

రెండో స్త్రీ: ఇదేం విడ్డూరమమ్మా! పుట్టి బుద్ధెరిగినాక ఎప్పుడూ చూడలేదమ్మా ఈవింత.

మూడో స్త్రీ: అవునవును. మరీ ఘోరకలి వచ్చిపడిందమ్మా. ఎందరొచ్చి చేతులువేసినా ఈ రథం అంగుళంకూడా కదలటంలేదు. పాపం ఆ దేవదాసి చూడు అలంకరించుకుని ఎల్లా పడిగాపులు పడుతూ నిల్చుందో!"

ఒ. స్త్రీ: అసలు రథం కదలటంవాంటూ వుంటేకదా ఉత్సవమూ ఊరేగింపూ!

రెం. స్త్రీ: అదే కనబడకుండా వుంది. ఆఖరికి రథం చక్రాలు గిర్రుమనటం కూడా లేదాయె. ఇంకేం కదులుతుందీ? కాళ్లు బలపాలు కట్టేలాగా అటూఇటూ తిరగటందేనికీ? పదండి కొంపలకి చేరుకుందాం. ఇవాళ ఉత్సవం జరగే ఆశలేదు పదండి.

మూ. స్త్రీ: ఈయేడు ఇలా జరుగుతుందని మా సిద్ధాంతిగారు జోస్యం చెప్పనే చెప్పారు. అక్షరాలా అల్లాగే జరిగింది సుమా!

ఒకటో పురుషుడు: ఇవాళ కాలదేవత రథోత్సవం కాదుటోయ్! కాని ఇదేం విచిత్రం చెప్మా? ఈ రథం కదలదేమిటి?

రెండో పురుషుడు: ఆ రథం గొలుసులు ఎల్లా మట్టిలోపడి దొర్లుతున్నాయో చూడు! యెంత దుర్దినం!

మూడో పురుషుడు: కాదు, కాదు, సరిగ్గా చూశావూ? ఆ గొలుసులు తాచుపాముల్లాగా కదులుతున్నయ్. కొంపతీసి ఈ రథం ఇవాళ దావంతట అదే కదులుతుందేమో!

ఒ. పు: దావంతట అది కదిలితే ఇంకేమైనా వుందీ? అన్నీ తలక్రిందులై పోవలసిందే! మనందరం దాని చక్రాలకిందపడి నుగ్గునుగ్గయి పోవలసిందే!

రె. పు: అమ్మ బాబోయ్! అంత ఉపద్రవం ముంచుకొస్తే ఇంకేముంది? అరుగో శాస్త్రుల్లు గారు ఏదో మంత్రాలు చదువుతున్నారు. పోయి ఆయన్నడుగుదాం రండి.

మూ. పు: ఆయనకి మాత్రం ఏం తెలుసూ? మంత్రాలకి రథం అంగళమైనా కదలదు పోవోయ్.

ఒ. పు: ఈవేళ ఎవరు చేతులువేసినా ఈ రథం కదిలేట్లు లేదు. ఎవరైనా మహా పురుషుడు వచ్చి పూనుకుంటేకాని కదలదేమో మరి.

రెం. పు: ఎవరో మహా పురుషుడి కోసం మీనమేషాలు లెక్కపెడుతూ కూచుంటే పుణ్యకాలం కాస్తా గడిచిపోతుంది.

మూ. పు: అయితే ఇప్పుడేం చేద్దాం చెప్పండి? శాస్త్రాల్లో ఏం చెప్పారో తెలుసా? తూర్పు తెల్లారకముందే పురోహితులు, అటు తరవాత రాజుగారూ రథంమీద చేతులువేస్తే కదులుతుందని వుంది. కాని ఇవాళ అన్ని ప్రయత్నాలూ వృథా అయిపోయినయ్. ఇక మీదట ఏం జగగాలో, ఇంక ఎవరు ఈ రథాన్ని కదపగలరో అయోమయంగావుంది. అంతా అగమ్యగోచరంగా వుంది. అదుగో ఆ గొలుసులు చూడూ! బుసలుకొట్టే కోడె తాచుల్లాగా ఎలా ఊగుతున్నయో! అమ్మో! అమ్మో ఇంక మన గతి యేమిటి? మనందరం దీని చక్రాలకింద నలిగిపోవలసిందేనా?

(సైనికులు ఉద్రిక్తులై ప్రవేశిస్తారు.)

ఒకటవ సైనికుడు: సిగ్గు సిగ్గు! రాజుగారే వచ్చి గొలుసులు భుజాన వేసుకున్నారు. మనమందరం బలంకొద్దీ పెనుగులాడాం. అయినా రథం అరంగుళం కూడా కదిలిన పాపాన పోలేదు. ఛీ! ఛీ! సిగ్గు! సిగ్గు!

రెం. సై: నా కడుపు మండిపోతోంది. కొండల్ని పిండి చెయ్యగల మన బలం, శత్రురాజుల కిరీటాలని మట్టిలో దొరించగల మన

మూలం: రవీంద్రుడు.

అనుసరణ: "అమరేంద్ర"

కార్యం ఇవాళ గుడ్డి గవ్వకు కొరగాకుండా పోయినయ్. ఇంకెందుకూ మన పరాక్రమం?

మూ. సై: ఎదురులేని నా ఖడ్గాన్ని ఈ రథం మీదే ప్రయోగిస్తాను. నా భుజబలంతో దీన్ని తునా తునకలు చేసేస్తాను. అప్పటికి కాని నా పరాభవాగ్ని చల్లారదు. రండి ఎవరు అడ్డం వస్తారో చూస్తాను. కాలదేవత తన రథాన్ని ఏమాత్రం రక్షించుకుంటాడో చూస్తాను

పౌరులు: ఆగు. ఆగు. తొందర పడకు. శాంతించు. తాతల నాటినించీ పూజిస్తూవున్న రథంమీద కత్తినూస్తావా? ఒళ్లు మరచి మాట్లాడుతున్నావు జాగర్త!

మూ. సై: వదలండి. వదలండి నన్ను. నాది సైనిక ధర్మం. నేను ఓటమిని ఒప్పుకోను. వదలండి. ఇవ్వాళ దీని అంతు కనుక్కుంటాను.

పౌ: ఆకే నీ అంతు కనుక్కుంటుంది జాగర్త! అనవసరంగా నిప్పుల్లో దూకుతావా? ఆగు, ఆగు.

ఒ. స్త్రీ: అదుగో [illegible]గాడమ్మా! ధనపతి పరివారంతో సహా వొస్తున్నాడు.

రెం. స్త్రీ: తగునమ్మా అని తయారయాడు కాబోలు! ఖజానా విడిచిపెట్టి రావటానికి పాపం ఎంత బాధ పడ్డాడో!

మూ. స్త్రీ: కాదమ్మోయ్! పిలవని పేరంటానికి వచ్చాడనుకున్నావేమిటీ? రాజుగారు స్వయంగా పిలిపించారుట. ఈ కలియుగంలో డబ్బేకదా రాజ్యం చేస్తోంది? ధనపతి చెయ్యి వేస్తేనే కాని రథం కదలదని ఎవరో అన్నారుట, అందుకని రాజుగారు పిలిపించారుట. పిలిచారు కదా అని పరివారంతో వచ్చాడు.

ఒ.సై: వచ్చాడా ధనపతి? ఏమిటీ? రథాన్ని కదిలిస్తాడా? మేం అంతా చేతకాని వాళ్లమై గాజులు తొడుక్కున్నామా?

రెం: సై: ఇవాళ కోపపడి లాభంలేదు. ధనపతి తలుచుకుంటే ఏమైనా చెయ్యగలడు.

మూ. సై: మనమంతా కదపలేక పోయిన రథాన్ని ఈ ధనపతి కదిలిస్తాడా? గట్టిగా ఉరిమితే మూల నక్కుతాడు కదా ఈ శూరాగ్రేసరుడు? నిజంగా ఇవాళ ధనపతి రథాన్ని కదిలిస్తే మనందరం ఖడ్గాలని గిరగిర తిప్పి విసిరేసి ఏ నదిలోనో దూకి చావటం మంచిది.

రెం. సై: మనం తొందరపడి లాభం లేదు. ఈ ధనపతి ఎంతకైనా సమర్థుడు. చూడు ఎంత పరివారాన్ని వెంటబెట్టుకుని వచ్చాడో!

పౌ: చూడు వాళ్ళ మెళ్లో బంగారపు గొలుసులూ, వజ్రాలూ, రత్నాలూ ఎల్లా కళ్లు జిగేలు మనేట్లు మెరిసి పోతున్నయ్యో చూడు. ఈ బంగారపు గొలుసులతో వాళ్లు రథాన్ని కదలకుండా కట్టిపారేశారేమో! అందుకే ఇది అంగుళమైనా ముందుకి జరగటం లేదేమో!

ఒ. సై: ఏయ్! ఎవరు మీరు? ఇక్కడికెందుకొచ్చారు?

పరివారంలో ఒకడు: ఇవాళ రాజుగారు మా ధనపతిగారి కోసం కబురుపంపారు. కాలదేవత రథాన్ని ఎవరూ కదపలేక పోతున్నారట. ధనపతిగారి చెయ్యి తగిలితే రథం కదులుతుందని అంతా అనుకుంటున్నారు.

మూ. సై: మీ ధనపతికి మతిపోయిందా యేమిటి?

పరివారంలో మరొకడు: మా ధనపతికి మతిపోలేదు. మీకే గతిలేక పిలిచారు.

ఇంకొకడు: ఈ లోకాన్ని చక్రంలాగా తిప్పుతున్నది మా ధనపతి కాదా? ఆయనకి సాధ్యంకాని పనివుందా? ఈ రథాన్ని కదల్చటం ఆయనకి తప్ప ఇంకెవరికీ శక్యం కాదు తెలుసా?

మూ. సై: చాల్లేవోయ్ నీ ప్రగల్భాలు!

ఒ. స్త్రీ: అయ్యో! అయ్యో! చూడండి, చూడండి, ఆ రథం చక్రాలు నేలలోకి ఎల్లా కుంగిపోతున్నయ్యో!

రెం. స్త్రీ: ఎక్కడో కొండ గుహల్లో ముక్కు మూసుకుని తపస్సు చేసుకునే ఆ ముసలియోగి చెయ్యివేస్తే రథం కదులుతుందని ఎవరో చెప్పారుట. ఆ గుహ దగ్గరికి వెళ్ళి చూసేసరికి పద్మాసనం వేసుకుని సమాధిలో వున్నాడుట. ఎల్లాగో తంటాలుపడి ఆయన్ని బతిమాలి బుజాలమీద మోసుకొచ్చారు.

మూ. స్త్రీ: అరవై యేళ్ళ తపస్సుతో ఆయన కాళ్ళు తుప్పుపట్టినయ్ కాబోలు. నడవలేడుట. మాట్లాడటమే మహాపాపమని [illegible] కాష్ఠా [illegible]నేసుకున్నాడుట. అంతా సౌంజ్ఞ

తోచే. వాటికి ఎవరికి తోచిన వ్యాఖ్యానం వాళ్లు చెబుతున్నారు.

ఒ. స్త్రీ: ఎక్కడ పట్టుకొచ్చారో ఈ మహానుభావుణ్ణి? చెయ్యి పడంగానే ఈ కాలదేవత రథచక్రాలు నేలలోకి కూరుకుపోయినయ్. ఈయన తపస్సు చల్లగావుండా! తనతో పాటు ఈ రథాన్ని కూడా అధఃపాతాళానికి గుంజుకు పోడుగదా?

ధనపతి పరివారం: చూడండి, ఇవాళ మీకే తెలుస్తుంది మా ధనపతి ఘనత. ఆయనే ఈ రథాన్ని కదిలించగలడు. ఇంకెవరికీ సాధ్యం కాదు.

మూ. సై: చేలండి! నోటికి వొచ్చినట్లు చేలండి. మీ ధనపతి గర్వం నీటి బుడగలాగా పేలిపోతుంది కాసుకోండి!

[ధనపతీ, ప్రధానీ ప్రవేశిస్తారు]

ధనపతి: ఎందుకు స్వామీ! నన్ను పిలిపించారు?

ప్రధాని: మనరాజ్యానికి ఏఇబ్బంది వచ్చినా నీ వద్దకి రాకతప్పదుగా, ధనపతీ!

ధ: ఇది మామూలు ఇబ్బంది కాదుగా స్వామీ? ఇప్పుడు నేనేం చెయ్యగలనో తెలియకుండా వుంది.

ప్ర: కాలదేవత రథం కదలటం లేదివాళ. నీచెయ్యి పడితే కదులుతుందేమోనని ఆశగా వుంది. ఇది నిజంగా మనకి పరీక్షా సమయం. ఈ రథాన్ని ఎవరు కదిలించగలరో వాళ్ళే ఈ లోకానికి అధిపతులవుతారు. ఇవాళ పురోహితులూ, రాజుగారూ, ఎంత ప్రయత్నించినా, రథం కదలలేదు. అంటే కులమూ బలమూ రెండూ ఇవాళ లోకాన్ని నడిపించటం లేదన్నమాట. నువ్వు కదిలించగలవేమోనని అందరం ఆశపడుతున్నాం.

ధ: చిత్తం! తమ సెలవైతే అల్లాగే ప్రయత్నిస్తాను. ముందు నా పరివారం ప్రయత్నించాక నేను చెయ్యి వేసుకుంటాను. నలుగురిలో నవ్వులపాలు కావటం నా కిష్టం లేదు.

ప్ర: త్వరపడాలి మరి. అంతా ఎదురు చూస్తున్నారు వెయ్యికళ్ళతో!

ధ: రండి, రండి, పట్టండి, ఊఁ.

ప: ఊఁ...ఊఁ—జయ్ ధనపతీ! జయ్ ధనపతీ! ఊః.

ధ: అందరూ పట్టండి. ఏదీ ఇంకొక్కసారి; ఊఁహుఁ. లాభం లేదు. ముచ్చెమటలు గిరజాలి పోతున్నయ్. నరాలు తెగి పోతున్నయ్. లాభంలేదు. రథం కదలటం లేదు.

పౌరులు: సిగ్గు! సిగ్గు!

సై: తగినశాస్తి జరిగిందా? రథచక్రాలు కదపటం సంచులు నింపుకోటం అనుకున్నావా? ఫో, వెళ్లు వెళ్లు. అసలు నీచెల తీసేస్తే కాని నీ గర్వం తగ్గదు.

ధ: ఈ మధ్య పనిలేక మీకత్తులు తుప్పుపట్టిపోయినట్లున్నయ్. ఎందుకుస్వామీ అంత విచారంగా వున్నారు? ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారూ?

ప్ర: నా ఆఖరి ప్రయత్నంకూడా విఫలమయిపోయింది. ఇంకేం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాను? ఈరథం ఎల్లా కదులుతుందా అని దిగులుగావుంది ధనపతీ!

ధ: దిగులెందుకుస్వామీ? దాని సమయం వస్తే అదే కదులుతుంది లెండి. ఎవరికోసం కదులుతుంది? కాలదేవత కాళ్లు ముడుచుక్కూచుంటూండా స్వామీ? రండి రండి ఖజానాకి గట్టిగా తాళంపెట్టి వొచ్చానో లేదో? రండి రండి పోదాం రండి.

స్త్రీ: అమ్మనోయ్! ఇదేమిటి? నేల ఈనినట్లుగా ఏమిటీ జనం? ఎకాయెకి రథం దగ్గిరికే వొచ్చేస్తున్నారులా గుండే!

పూ: అమ్మనో! ఆ గుడిసెల్లో జనమంతా తండోపతండాలుగా వచ్చి పడిపోతున్నారు. రథాన్ని కదిలిస్తామని ఎల్లా కేకలు పెట్టుకుంటూ వొస్తున్నారో! కాలదేవత రథాన్ని తాకనిస్తామా?

స్త్రీ: అయ్యో! రథాన్ని మైలపడేస్తారా? వాళ్లని ఎవరూ ఆపలేరా?

సై: మీకేం భయంలేదు! ఈ రథాన్ని మేం రక్షిస్తాం.

ప్ర: ఆ జనసముద్రం ముందు మీరెంత? మీ ఆయుధాలెంత?

సై: మీరే అల్లా బెదిరిపోతే ఎల్లా చెప్పండీ?

ప్ర: వాళ్లవల్ల మనకి ప్రమాదం వస్తుందని

కాదు సాధ్యం. వాళ్ళు రథాన్ని కదిలించ గలరేమోనని నా సంశయం.

సై: అసంభవం స్వామీ! వాళ్ళే మిటి రథాన్ని కదిలించటమేమిటి? అల్లా ఎన్నటికీ జరగదు స్వామీ! ఆ గుడిసెల్లో నరాలపోగులు ఈ రథాన్ని కదిలించగలరా?

ప్ర: నిజంగా ఇవాళ వాళ్లు రథాన్ని కది లించగలిగితే ఒక కొత్త సత్యం మనకళ్లు విప్పు తుంది. ఒక కొత్త శకం ఆరంభం అవుతుంది.

సై: అజ్ఞ దయచెయ్యండి! మా ఖడ్గాలతో వాళ్లని ముక్కలు చేస్తాం అజ్ఞ దయచెయ్యండి స్వామీ.

ప్ర: ఈ ప్రవాహానికి కత్తులు ఎంతైన కడ తారా మీరు? లాభం లేదు.

సై: అయితే ఈమ గెలకేమిటి?

ప్ర: అవరోధాలు కల్పించిన కొద్దీ వాళ్ళ శక్తి విజృంభిస్తుంది. మీరేమీ చెయ్యవద్దు.

సై: చేతులు కట్టుకుని చూస్తూ నిలబడ మంటారా? కాలదేవత రథం మాకళ్ళ ముందరే మైల పడి పోతుంటే చూస్తూ పూరుకో మంటారా?

["కాలరథం కదిలిస్తాం" అంటూ కోలా హలం దగ్గరగా వినిపిస్తుంది.]

ప్ర: ఏం, సర్దార్! ఎందుకిల్లా తరలివచ్చారు మీరంతా?

స: ఏంలేదు స్వామీ! కాలదేవత రథాన్ని కదిలించటానికి వచ్చాం.

ప్ర: నిజంగానా?

స: అవును స్వామీ! ఇన్నాళ్ళూ కాలదేవత రథచక్రాల కిందపడి నలిగిపోయాం. ఈసారి మా శిసల దేహాలమీదుగా కాలదేవత రథాన్ని నడపటానికి నిరాకరించాడు. ఈసారి రథపు గొలుసులు మా భుజాలమీద వేసుకుని రథాన్ని ముందుకు నడిపించాలని మేమందరం బయలు దేరి వచ్చాం.

పు: ఎవరు పుట్టించారురా మీకీ దుర్బుద్ధులు? వినాశకాలే విపరీతబుద్ధి అని ఊరికే అన్నారా పెద్దలు.

స: ఇవాళ కాలదేవతే మమ్మల్ని ఎలుగెత్తి పిలిచాడు. ఇవాళ ఈ రథాన్ని కదిలించికాని మేము ఇక్కణ్ణించి కదలం.

పు: ఎన్ని గుండెలతో అంటున్నావురా ఆ మాట? ఈ లోకాన్ని ఎవరు కదిలించగలరో వాళ్ళే ఈ రథాన్ని కదిలించగలరు, తెలుసునా?

స: అయితే మీరేనా ఈ లోకాన్ని కది లించేది?

పు: నీకు కళ్లు నెత్తికెక్కాయిరా, అబ్బాయ్!

స: తమరేనా స్వామీ ఈ లోకాన్ని కది లిస్తున్నది?

ప్ర: కాదు కాదు. మీరు కదులుతూ మీతోపాటు లోకాన్ని కదిలిస్తున్నారు. కాని మా బుద్ధి బలంతో మేమే మిమ్మల్ని కదిలిస్తు న్నామని గొప్ప చెప్పుకుంటాం.

స: మేం లేకపోతే మీరెక్కడుంటారు? మేం పండించిన పంటతో మీ శరీరాలు పోషించుకుంటున్నారు. మేం నేసిన బట్టలతో మీ పరువు నిలుపుకుంటున్నారు. అవునా?

ప్ర: నిజం, నువ్వనేది నిజం, సర్దార్.

సై: ఎంత కండకావరం! ఎప్పుడైనా ఈ గుడిసెల్లో వాళ్లు ఇలా తెగబడి మాట్లాడి ఎరు గుదుమా? ఈ ధిక్కారం మేం సహించలేం! చెప్పుకింద నేలలాగా అణిచేస్తాం, అజ్ఞ ఇవ్వండి స్వామీ.

ప్ర: మీరు నిశ్చలంగా నిలబడాలని నా అజ్ఞ. పదండి. మీరు ప్రయత్నించండి. చూద్దాం పదండి సర్దార్.

స: చూస్తారేం? అందరూ పట్టండి. నడు ములు బిగించండి. రథం కదలక ఏం చేస్తుంది? ఈరోజు మన శక్తి అంతా ఉపయోగిద్దాం. అటో ఇటో తేల్చివేద్దాం.

పురోహితుడు: అయ్యయ్యో! ఏం పోయే కాలం వచ్చిపడిందిరా! రథాన్ని తాకారూ? రథాన్ని అపవిత్రం చేశారూ? సర్వనాశనం. సర్వనాశనం.

స్త్రీలూ, పురుషులూ: అయ్యయ్యో! ఎంత పని చేశారు. ఎంతపని చేశారు.

పు: మీరంతా కళ్లు గట్టిగా మూసుకోండి. వీళ్ళ సాహసానికి తగిన శిక్ష కాలదేవత విధిం చక పూరుకుంటాడా? కాలదేవత ప్రళయ తాండవం చేస్తాడు. వీళ్లంతా భస్మమైపోతారు.

ఆ ఘోర దృశ్యాన్ని మీరు చూసి భరించలేరు. నా మాట విని గట్టిగా కళ్లు మూసుకోండి.

స్త్రీ: ఏమిటీ ప్రచండ ధ్వని! పిడుగులు పడుతున్నట్లు, మిన్ను విరిగి మీద పడిపోతున్నట్లు—

పుర: అదుగో రథం కదులుతున్నట్లుగా వుంది! అదుగో ఎర్రటి మబ్బులాగా దుమ్ము ఎల్లా లేగుతున్నదో. చెవులు చిల్లులు పడే ధ్వని. అబ్బా!

పు: పాపం! ఘోర పాపం! సర్వనాశనం తప్పదు, తప్పదు.

సై: అనుజ్ఞ ఇవ్వండి స్వామీ! క్షణంలో వీళ్లని చెల్లాచెదరు చేసి చీల్చి చెండాడుతాం!

పు: నేనేమీ చెప్పలేను. కాల దేవతకి తెలియదా తను మైల పడుతున్నట్లు? ఆయనే మెదలకుండా వూరుకుంటే మధ్య నాకెందుకూ?

సై: ఇంకెందుకూ సంకోచం? ఈ నాగరగాని ఆయుధాలని దూరంగా గిరాటు వేసేద్దాం.

పు: నేనూ ఈ శాస్త్రాలని విసిరిపారేస్తాను, ఇంకెందుకు?

పౌ: పదండి. ఈ పాపిష్ఠి రాజ్యాన్ని విడిచి వెళ్ళిపోదాం రండి. మాస్తాకేం ప్రధానమంత్రి గారూ? తమరుకూడా మాతో దయచెయ్యరా?

ప్ర: నేనూ వెళ్తున్నాను.

పు: ఎక్కడికి?

ప్ర: వాళ్లతో కలిసి రథాన్ని లాగటానికి.

పు: తమరా? వాళ్ళతో కలిసి రథం లాగుతారా?

ప్ర: అవును. ఈరోజున ఒక కొత్త సత్యం నా కళ్ళముందు మెరిసింది. మనం కూడా వాళ్ళతో కలిసిపోవాలి. ఎడంగా నిలబడటమే మహా పాపంగా కనిపిస్తోంది.

సై: క్షమించండి. అల్లా ఎన్నటికీ జరగనివ్వం. సైన్యమంతా సమీకరించి రథాన్ని నిలబెట్టేస్తాం. దాని పరుగు ఆగకపోతే రథ చక్రాలు ఇవాళ రక్తపు నదులలో దొర్లుతుంటూ పోవలసిందే.

పు: పదండి, రథాన్ని నిరోధించండి. నేనూ వస్తున్నాను పదండి.

ప్ర: ఇవాళ దాన్ని నిరోధించటం మీ తరం కాదు. దాన్ని అడ్డగిస్తే చక్రాల కింద తుత్తునియలైపోతారు. జాగ్రత్త!

సై: మైలపడిపోయిన రథ చక్రాలని మా పవిత్ర రక్తంతో స్నానం చేయిస్తాం స్వామీ.

పు: చూశారా, చూశారా, ఆ రథం దాగీడొంకా లేకుండా యెల్లా విచ్చలవిడిగా విరగబడుతున్నదో? సర్వనాశనం! సర్వనాశనం!

(రక్షించండి అని కేకలు వినబడతయ్)

సై: అదుగో! ధనపతి అదుర్దాగా కేకలు పెడుతున్నాడు. ధనాగారాన్ని రక్షిద్దాం రండి, రండి.

ప్ర: ముందు మిమ్మల్ని మీరు రక్షించుకోండి.

సై: అయితే ఏం చెయ్యమంటారు?

ప్ర: పదండి. వాళ్ళతో కలిసిపోయి రథాన్ని సరైన దారిలో నడిపిద్దాం. వేరే దారిలేదు. ఆలస్యం చెయ్యొద్దు. మీరు రాకపోతే నేను ఒక్కణ్ణే వెళ్తాను.

పు: అయితే మీరేం నిశ్చయించుకున్నారు నాయనా! వాళ్లతో కలుస్తారా? వాళ్ళని నిరోధిస్తారా? తేల్చుకోండి త్వరగా.

సై: మాకెటూ పాలుపోవటం లేదు స్వామీ మీరేం చేస్తారు మరి?

పు: చూశారా! నేలంతా గజగజ వణికిపోతోంది!

౧. సై: రథం తనంతట తనే పరిగెడుతున్నట్లుగా వుంది. దానికే ప్రాణం వచ్చినట్లుగా వుంది. అబ్బా! ఉరుములూ పిడుగులూ గర్జించినట్లు యెంత ప్రచండంగా ధ్వని చేస్తున్నదో!

(జయజయ ధ్వనులూ, రథ చక్రాల ధ్వనీ క్షణంసేపు వినిపిస్తయ్.)

౨ సై: ఎవరో ఇటువస్తున్నారు! ఎవరది? కవిగారా?

కవి: ఎందుకల్లా దిగులుపడి నిలబడ్డారూ?

మూ సై: మాకు దిక్కు తెలియకుండా వుంది. ఏం చెయ్యటానికి తోచటం లేదు.

పు: చాలా బాగుంది మీ సంగతి. అడక్క అడక్క ఆ వెర్రి కవి సలహా అడిగారా? ఆయనేం చేస్తున్నాడో ఆయనకే తెలియదు గదా! ఇంక మీకేం చెబుతాడు.

కవి: కాల రథం కదిలింది
గాఢ నిద్ర వొదిలింది.
నేల ప్రకంపించింది
కాల రథం కదిలింది.

సై: అయితే మమ్మల్నిప్పుడేం చెయ్యమం టావయ్యా?

పు: పోనీనువ్విప్పుడేం చెయ్యబోతున్నా వయ్యా?

కవి: ఆశాగానం ఆలపించబోతున్నాను.

సై: చాలా బాగుందిలే నీ వరస. ఒకమూల రాజ్యమంతా తలకిందులై పోతుంటే ఒకమూల కొంపలు అంటుకుపోతుంటే ఎవడికి కావా లోయ్ నీ పాటలు?

క: రాజ్యాలు బుద్బుదాలు. అవతరిస్తయ్. అస్తమిస్తయ్. కాని కలకాలం వెలిగే సత్యా లున్నవని మరిచిపోకండి.

పు: అంటే మీ కవిత్వాలు కలకాలం ఊరేగుతయ్యనేనా నీ అహంభావం? ఈసారి రథం ఆగితే మీ కవులే కదిస్తారేరు బోలు! ఏం అవునా?

క: అవును. ఆ తరుణం తప్పక వస్తుంది. ఈ రథాన్ని ఎల్లా పరిగెత్తించాలో మాకూ తెలుసును మీరు పిరికిపందలలాగా, బలహీ నులలాగా హింసనే ఆశ్రయించారు. అందుకే రథం దారితప్పింది. మేం సౌందర్యాన్ని రథ సారథిని చేస్తాం. అందం, ఆనందం, ఛందం ఈ స్యందనాన్ని స్వచ్ఛందంగా ముందుకు పరుగులు తీయించగలవు. ఆ రహస్యం మాకే తెలుసు.

సై: ఇంతకీ ఏమిటయ్యా నీ గొడవ? రథం ఇటే పరిగెత్తుకొస్తోంది. త్వరగా చెప్పవయ్యా స్వామీ! నువ్వేం చెయ్యదలుచుకున్నావూ?

క: ఆ రథాన్ని కదిలించే సోదరుల పాదాల కదలికతో శృతి కలిపే పదాలు పాడతాను. వాళ్ళ ప్రగతిపాటలలో అపశృతి రాకుండా చేస్తాను. శృతి తప్పటమే అన్నిటికీ మూలమైన దుర్గతి. నా సోదరుల హృదయస్పందనమే నా కవనానికి ఛందం.

సై: ఇంతకీ మమ్మల్ని ఏంచెయ్యమంటావో చెప్పు బాబూ?

క: తొందరపడిమటుకు ఏమీ చెయ్యకండి. మీకూ పిలుపు వస్తుంది. ఆ పిలుపుకోసం ఓర్పుతో ఎదురు చూడండి.

గాఢనిద్ర వొదిలింది
కాలరథం కదిలింది
నేల నాల్గుచెరగుల నవజీవం వికసించింది
నీలగగనవీధుల నవతేజం ప్రభవించింది
కాలరథం కదిలింది,
కాలరథం కదిలింది.
[శంఖధ్వనీ, తూర్యారవం వినిపిస్తయ్.]

——:0:——

# ఉత్తమ రచనలకు బహుమతి

## తెలుగు భాషా సమితి గడువు పొడిగింపు

1951 - 52 సంవత్సరమునకు సంబంధించిన ఉత్తమ గ్రంథముల బహుమతుల పోటీకి క్రింద వివరించిన విషయములపై గ్రంథములను పంపు టకుగాను గడువు నవంబరు ఒకటవ తేదీవరకు పొడిగించబడింది.

విషయములు : కర్నాట సంగీత పరిణామము, ఇండియా దేశ శిల్ప, చిత్రలేఖన, కళావికాస చరిత్ర చలన చిత్రములను తీసి ప్రదర్శించే శాస్త్ర పద్ధతి, తెలుగు కవయిత్రుల కవిత్వము నకు సంబంధించిన సవిమర్శక సమీక్ష, ఆహార ములు — సహజములు, సంయోగికములు విని యుక్త రసాయన శాస్త్రము.

ఇవి అచ్చులో ౹రాన్ 200 పుటలకు మించ వలెనట.

ఈ గ్రంథములను కార్యదర్శి, తెలుగు భాషా సమితి, 27, మద్రాసు విశ్వవిద్యాలయ భవన ములు, మద్రాసు-5. అను చిరునామాకు గడువు లోపుగా పంపవలెను.

# బ్రిటనులో ఎన్నికలు

"అశ్వని"

వచ్చే అక్టోబరు 25న బ్రిటనులో పార్లమెంటుకు ఎన్నికలు జరుగుతాయని బ్రిటిషు ప్రధాని అట్లీ తెలియబరిచాడు. ఈ ఎన్నికలలో కన్సర్వేటివులు తిరిగి పదవిలోకి వస్తారని ప్రవాదు బయలుదేరింది. షేర్ మార్కెట్ సంచలనం కన్సర్వేటివుల విజయాన్ని సూచిస్తున్నదని పత్రికలలో చదివాం. ఇదే గనక జరిగినట్టయితే బ్రిటిషు లేబరు పక్ష నాయకులు ఎవరినీ తప్పుపట్టే పని ఉండదు. గత సంగ్రామంలో కలిగిన జ్ఞానోదయంతో బ్రిటిషు ప్రజలు తమ చేతికి వప్పగించిన అధికారాన్ని లేబరు నాయకులు కన్సర్వేటివులకు ఉపకరించే విధంగా వినియోగపరిచారుగాని ప్రజలకు వినియోగపడేటట్టు ఉపయోగించలేదు. లేబరు ప్రభుత్వం పరిశ్రమలను జాతీయం చెయ్యటానికీ, ప్రజలకు ఉచితవైద్య సౌకర్యాలు కలిగించటానికీ ప్రయత్నించలేదా, కన్సర్వేటివులతో అనేక విషయాలపై తర్జనభర్జనలు పడలేదా- అనవచ్చును. ఇదంతా నిజమే. కాని నూరు నోములు ఒక్క రంకుతో సరి అన్నట్టు, లేబరు ప్రభుత్వం అమెరికాకు దాసోహమని- రష్యా నుంచి తనకు ముప్పు లేదనీ, బ్రిటనుకుగల ముప్పంతా అమెరికా తలపెట్టే కమ్యూనిస్టు వ్యతిరేక యుద్ధ ప్రయత్నాలవల్ల నేననీ తెలిసి కూడా అటువంటి ప్రయత్నాలు సాగించి సామాన్య ప్రజలకు దుర్భర ఆర్థిక పరిస్థితి తెచ్చిపెట్టటంవల్ల లేబరుపార్టీ సాగించిన సత్కార్యాలు రాణించలేదు.

యుద్ధం అయిపోయి లేబరు ప్రభుత్వం ఏర్పడిన నాటినుండీ బ్రిటను అమెరికాకు అంతర్జాతీయ వ్యవహారాలలో కుడిభుజంగా ఉంటూ, రష్యా వ్యతిరేక విధానాలను బలపరచటంలోనూ, అమెరికాకు ప్రపంచమంతటా యుద్ధ స్థావరాలు ఏర్పాటు చెయ్యటంలోనూ, ఐక్యరాజ్యసమితి శాంతిరక్షణ విధానాలను విసర్జించి అమెరికా దుర్మార్గాలను బలపరిచేలాగు చెయ్యటంలోనూ, కొరియాలో అమెరికను రాక్షసత్వం విజృంభించటంలోనూ, అట్లాంటిక్ కూటమి ఏర్పరచటంలోనూ, మధ్య ప్రాచ్య దూర ప్రాచ్యాలలో ప్రజాస్వామ్యాలు తల ఎత్తకుండా అణచటంలోనూ తాయెత్తులా తోడ్పడుతూ వస్తున్నది.

బ్రిటిషు లేబరుప్రభుత్వం ఇంకొక ప్రమాదకరమైన పనికూడా చేస్తున్నది. తన దేశంలో సోషలిస్టు విధానా లవలంబిస్తున్నట్టు నటిస్తూ, ఇతరదేశాలపట్ల చాటుగానూ, బహిరంగంగానూ సామ్రాజ్యవిధానాలను అవలంబిస్తున్నది. మధ్య ప్రాచ్యంలో పర్షియా నూనె విషయంలోనూ, సూయజ్ కాలవ విషయంలోనూ, ట్రాన్స్‌జోర్డన్ విషయంలోనూ బ్రిటిషు లేబరు ప్రభుత్వం అవలంబించినవిధానం సోషలిస్టువిధానమనిపించుకోదు. మలయాలో ఈ ప్రభుత్వం అవలంబించే విధానం పచ్చి ఫాసిస్టు విధానమనిపించుకుంటుంది. రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం వచ్చిన మరుక్షణం రష్యన్ సోషలిస్టు ప్రభుత్వం జారు నాటి దోపిడీ ఒప్పందాలన్నిటినీ చించేసి టర్కీ, చైనా, ఫిన్లాండ్, పోలండ్ మొదలైన అనేక దేశాలతో న్యాయమైన ఒడంబడికలు చేసుకున్నది ఈ విషయంలో బ్రిటను రష్యాను అనుకరించ యత్నించిందని తప్పుపట్టే అవకాశం లేకుండా చూశారు లేబరుపార్టీ అగ్రనాయకులు.

కన్సర్వేటివులను ఓడించి పదవి స్వీకరించిన లేబరు ప్రభుత్వం తన అంతర్జాతీయ విధానంలో కన్సర్వేటివుల విమర్శకు గురికాకపోవటం చాలా చిత్రమైన విషయం. మొట్టమొదట లేబరు ప్రభుత్వ ఆర్థిక విధానాలనూ, పరిశ్రమల జాతీయకరణాన్ని ప్రతిఘటించిన కన్సర్వేటివులు ఇదంతా జరిగేదికాదని తెలియగానే ఈ ఆర్థిక విధానాలపై ఆందోళన మానేశారు. బ్రిటిషు ప్రజలనందరినీ కష్టాలపాలుచేసి ముందు

ముందింకా బాధించనున్న ఆయుధ నిర్మాణం కన్సర్వేటివులకు సమ్మతంగానే ఉన్నది.

బ్రిటిషు ప్రజలకు బాధలుపడటం చాతకాదని ఎవరూ అనలేరు. వారు గత యుద్ధంలో ఎన్ని ఇబ్బందులనైనా ఎదుర్కొన్నారు. యుద్ధం ప్రారంభమైన కొంతకాలం వరకూ ప్రభుత్వం చేసినదానికంటె ప్రజలు చాలారెట్లు యుద్ధయత్నాన్ని తామై సాగించారు. నాలుగు వందల డెబ్బైకోట్ల పౌనులు యుద్ధం ఖర్చుకు అవసరం ఉన్నదని వారికి లేబరు ప్రభుత్వం నచ్చచెప్ప గలిగితే ధరలు హెచ్చినా, వస్తువుల కరువు ఏర్పడ్డా వారు లక్ష్యపెట్టరు. కాని అటువంటి తీవ్రపరిస్థితి ఏర్పడిందని అట్లీ గాని అతని అనుచరులుగాని రుజువు చెయ్యలేరు. రష్యా తదితర తూర్పు యూరపుదేశాల బలం విపరీతంగా పెరిగిపోయింది. దానికి తగ్గబలం అమెరికా బ్రిటన్ వగైరా దేశాలకు కూడా లేకపోతే యుద్ధం సంభవిస్తున్నదని అట్లీ అన్నాడు. దీనికి సాక్ష్యం లేదు. ఉన్నదే అనుకున్నా:

కిందటి యుద్ధానికి పూర్వం హిట్లరు 1935 నుంచీ జర్మనీలో యుద్ధ ప్రయత్నాలు సాగించాడు. ఈ యుద్ధ యత్నాలకు కావలసిన ప్రోత్సాహమంతా అమెరికా, బ్రిటనులనుండి లభించింది. కనీసం మూడేళ్లపాటు బ్రిటను హిట్లరును చూసి యుద్ధ యత్నాలు చేయలేదు. ఆ తరవాత చేశామంటే చేశామన్నది గాని 1939లో యుద్ధం ప్రకటించే నాటికైనా బ్రిటనుకు "యుద్ధ యంత్రం" లేనేలేదు. హిట్లరు "నీతి"కి కట్టుబడి రష్యా మీద పడటానికి మారుగా బ్రిటనుపైనే పడ్డాడు. అటువంటి పరిస్థితులలో కూడా హిట్లరును ఓడించే "యుద్ధ యంత్రమూ" ఆయుధాలూ బ్రిటన్, అమెరికాలకు లభించాయి. రష్యా చితుకుతుందేమోనని చూడకుండా యూరప్‌లో రెండో రంగం ఏ రోజున ఏర్పరిస్తే ఆ రోజున హిట్లరు కూలిపోయేవాడు. ఈ సంగతులన్నీ బ్రిటిషు ప్రజలకు తెలుసు. రష్యా హిట్లరు అడుగు జాడల్లో నడిచినట్టు ఏ రోజూ దాఖలా కనపడినా ఆ రోజు ప్రపంచ ప్రజలు రష్యా దురాక్రమణను అణచటానికి నడుములు కట్టలేక పోరు. పన్నెండేళ్ళ క్రితం ప్రపంచ ప్రజలు కొండిన శక్తి ఈనాడు లేదనుకోవటానికి ఆధారం లేదు. హిట్లరును ఓడించినది అచ్చగా ఆయుధాలు కావు, ప్రజలలో ఉండే నైతిక శక్తులు.

ఇదంతా లక్ష్యపెట్టకుండా, బ్రిటిషు ప్రజల నైతిక శక్తులను గాని, దేశాభిమానాన్ని గాని పరిగణించకుండా ఏనాడో రష్యా తలపెట్టబోయే ప్రపంచ దిగ్విజయ యాత్రను "నిరుత్సాహ"పరచటానికి బ్రిటిషు లేబరు ప్రభుత్వం ముందుగానే బ్రిటిషు ప్రజల వెన్ను విరగగొట్టబూనుకున్నది! ఇదైనా బ్రిటిషు ప్రభుత్వం తన స్వంత ప్రేరేపణతో గాని, బ్రిటిషు ప్రజల అనుమతితో గానిచేయటం లేదు; అమెరికా ప్రోద్బలంతో చేస్తున్నది. ఇందులో దాపరికం ఏమీలేదు. ఇటువంటి ప్రభుత్వాన్ని బ్రిటిషు ప్రజలు సహించవలసింలేదు. "వచ్చే ఎన్నికలలో మీ వోట్లు మాకిచ్చి నట్టయితే కన్సర్వేటివులు చెయ్యలేని ఫలానా ఉపకారాలు మీకు మేము చేస్తాం" అని లేబరు నాయకులు అనగల స్థితిలో లేరు.

బ్రిటిషు ప్రజలు తమకు లేబరు పార్టీలో విశ్వాసం తగ్గినట్టు కిందటేడు ఎన్నికలలోనే రుజువు చేశారు. ఆ ఎన్నికల ఫలితంగా లేబరు పార్టీకి గల మెజారిటీ నామమాత్రంగా పరిణమించింది. కొత్తగా యుద్ధవ్యయం ఒకటి తెచ్చిపెట్టిన తరవాత లేబరు పార్టీలోనే చాలా చీలికలు పుట్టాయి. అనూరిన్ బెవాన్, జిలియేకస్, హెరాల్డ్ విల్సన్ మొదలైన వామ పక్షీయులు చాలామంది అట్లీ పక్షాన్ని త్యజించారు. వారంతా లేబరు పార్టీలో ఉన్నప్పటికీ ప్రభుత్వ విధానాలను తీవ్రంగా నిరసిస్తున్నారు. వీరంతా అమెరికాను బ్రిటను శత్రువుగా కూడా చూస్తున్నారు. ఇందులో ఆశ్చర్యంలేదు. బ్రిటిషు ప్రజలు వారితో సంపూర్ణంగా ఏకీభవించవచ్చు. రేపు రష్యా ఏమి చేసినా చేయకపోయినా ప్రస్తుతం అమెరికా బ్రిటిషు ప్రజల కష్టాలన్నిటికీ ప్రత్యక్ష కారణమై కూచున్నది. అమెరికా తన యుద్ధ యత్నాలలో బ్రిటనును గొప్ప ప్రమాదానికి గురిచేస్తున్నది. బ్రిటిషు కార్మిక ప్రజల ఆర్థిక పరిస్థితులను తారుమారు చేస్తున్నది. మార్షల్ సహాయం పుచ్చుకున్న పాపానికి అమెరికా

బ్రిటనుకు అంతర్జాతీయ వ్యవహారాలలో స్వయం నిర్ణయమన్నది లేకుండా చేసింది. (ఉండే జపాను శాంతి ఒడంబడికపై బ్రిటను సంతకం పెట్టునా? బ్రిటిషు సైనికులు కొరియాలో చావవలసిన అగత్యం కలుగునా? బ్రిటనుకు అతి ముఖ్యమైన రష్యాతోటి వాణిజ్యానికి ప్రతిబంధకాలు ఏర్పడునా? చైనాపై బ్రిటను ఆంక్షలు విధించవలసి వచ్చునా? బ్రిటను పర్షియాల మధ్య తగాదాలో బ్రిటను అనుమతి లేకుండా ట్రూమన్ ప్రతినిధి వచ్చి జోక్యం కలిగించుకో గలుగునా? చైనాకు ఐక్యరాజ్య సమితిలో ప్రాతినిధ్యంఇవ్వాలని బ్రిటను నెత్తినోరూ కొట్టుకుని చెబుతున్న ముక్కను ఇంతకాలం అమెరికా వినిపించుకోకుండా ఉండగలుగునా?) అమెరికా మూలంగానే బ్రిటనుకు ముడి సరుకుల దుర్భర దారిద్ర్యం ఏర్పడింది. బ్రిటను స్వాతంత్ర్యం కొరకు, బ్రిటిషు ప్రజల క్షేమం కొరకు, అమెరికా ఆవగింజంత త్యాగం చేసినట్లు నిదర్శనం లేదు. బ్రిటను కష్టాలన్నిటికీ అమెరికాయే కారణమనటానికి బోలెడంత సాక్ష్యం ఉంది. అయినా బ్రిటిషు లేబరు ప్రభుత్వం అమెరికాకు అడుగులకు మడుగులొత్తుతున్నది. ఇంత "దీన్" అయిపోయిన ప్రభుత్వాన్ని ప్రజలు నెత్తికెక్కించుకుని ఊరేగ నిరాకరిస్తే ఆ తప్పు వారిది కాదు. లేబరు ప్రభుత్వం ఇంట కన్సర్వేటివులకూ సాష్టాంగ పడింది, రచ్చన అమెరికాకూ సాష్టాంగపడింది.

బ్రిటిషు ప్రజల మాట అట్లా ఉంచి లేబరు పార్టీలో పరిస్థితులు కూడా ఏమీ బాగా లేనట్టు కనిపిస్తుంది ఇండియాలో కాంగ్రెసు పార్టీలాగే బ్రిటనులో లేబరుపార్టీ అంతరంగిక విచ్ఛిత్తికి గురిఅవుతూ వస్తున్నది. లేబరు ప్రభుత్వం అనుసరించే విధానాలతో అసంతృప్తి చెంది 1947 లోనే 67 వేలమంది సభ్యులు లేబరు పార్టీని విడిచి వెళ్ళారట. అటుపిమ్మట కూడా సభ్యుల నిష్క్రమణ సాగుతూనే వున్నట్టు తెలుస్తున్నది. మన కాంగ్రెసు వర్గాలలో అవినీతిని గురించీ, కాంగ్రెసు విచ్ఛిత్తిని గురించీ ఆందోళన సాగినట్టే బ్రిటనులో కూడా స్థానిక శాఖలలో లేబరుపార్టీ పతనం గురించి ఆందోళన జరుగుతున్నది. ఈ ఆందోళననుండి పార్టీ నాయకులు గుణపాఠాలు నేర్చుకోక పోగా, బ్రిటిషు విదేశాంగ విధానం మారాలనీ, యుద్ధ యత్నాలు మానాలనీ, రష్యాతోగల విభేదాలు శాంతియుతంగా పరిష్కరించుకునే యత్నాలు జరగాలనీ, అమెరికా అడుగుజాడల నుంచి బ్రిటిషు లేబరు ప్రభుత్వం వైదొలగి తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవాలనీ, బ్రిటను శాంతికోసం కృషిచెయ్యాలనీ అనేవారిని అణచటానికి యత్నిస్తున్నారు. సోషలిస్టు ఫెలోషిప్ అన్న సంస్థ ఈ విధంగానే అణచబడింది.

సాధారణంగా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులలో ప్రభుత్వ నాయకులు ట్రేడ్ యూనియన్ ప్రతినిధులను కూడగట్టుకోగలుగుతూ వస్తున్నారు. పార్టీ వార్షిక సమావేశంలో తమకుసమ్మతంగాని తీర్మానాలు తెచ్చిన వారిని భయపెట్టీ, బెదిరించీ, అనేక డజన్ల తీర్మానాలను కలిపి "నిరపాయమైన" ఒక తీర్మానంగా తిరగరాసీ, వోటింగు విధానంలో దుర్మార్గం చేసీ తమకు ప్రతిపక్షం లేకుండా చూసుకుంటున్నారు. ఈసారి జరగబోయే పార్టీ సమావేశంలో ప్రభుత్వ నాయకులు కార్మికుల తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొనవలసి ఉంటుంది. జరగబోయే ఎన్నికలలో లేబరు పక్షం గతి ఏమికాబోయేదీ ఈ సమావేశంలో తేలిపోయింది.

బ్రిటిషు లేబరు పక్షంనుంచి మనం నేర్చుకోవలసింది చాలా ఉంది. బ్రిటిషు వోటరు ఈ అసమగ్రపు లేబరుపక్షానికో, ఇంతకన్న కూడా భయంకరమైన కన్సర్వేటివు పక్షానికో తప్ప మరెవ్వరికీ వోటు వేయలేని దుస్థితిలో తనను తాను పెట్టుకున్నాడు. మనకింకా అటువంటి దుస్థితి చేకూరలేదు. వచ్చే మన ఎన్నికలలో నిజమైన రాజకీయ స్వాతంత్ర్యానికి, ప్రజాభ్యుదయానికి, ప్రపంచ శాంతికి మనం వోటు చెయ్యనిపక్షంలో మరో ఎన్నికలు తిరిగి వచ్చే నాటికి మనదేశ పరిస్థితి ఇంకా హేయంగా పరిణమించి ఎటుచూసినా మనకు దిక్కు తోచకుండా పోవచ్చు. ఇది ఎంతమాత్రం వాంఛనీయం కాదు. అందుచేత భారతీయ పౌరులు ఇప్పుడే మేలుకుని జాతీయ, అంతర్జాతీయ విధానాల అంతర్యం సరిగా అవగాహన చేసుకోవాలి.

# నెహ్రూ కలిగించిన ఆశాభంగం

**తుర్లపాటి వెంకటకుటుంబరావు**

కాంగ్రెస్ అధ్యక్షుడు పండిట్ నెహ్రూ కొత్త వర్కింగ్ కమిటీ సభ్యుల జాబితా ప్రకటించాడు. కాంగ్రెస్ అధ్యక్షుడుగా పండిట్ నెహ్రూ "ఏదో" సాధించగలడని ఆశించినవారికి ఈ జాబితా మిక్కిలి అసంతృప్తిని, ఆశాభంగాన్ని కలిగించింది. బాబూ టాండన్ నియమించిన వర్కింగ్ కమిటీని సంపూర్తిగా పునర్నిర్మించాలని కోరిన సందర్భంలో "వర్కింగ్ కమిటీ! వెలుపల వున్న అనేకమంది మేధావంతులకు, సమర్థులకు ప్రాతినిధ్యంవహించే రీతిగా దానిని పునర్నిర్మించాలనే నా అభిలాష" అని పండిట్ నెహ్రూ ప్రకటించి వున్నాడు. వర్కింగ్ కమిటీ పునర్నిర్మాణం జరగాలని ఆందోళన చేస్తున్న సమయంలో, "కాంగ్రెస్‌లో నూతనోత్తేజం కలిగిందని, దానిలో అపూర్వ పరివర్తనం వచ్చిందని ప్రజాసామాన్యం భావించేటట్లుగా కాంగ్రెస్‌ను సంస్కరించడమే తన లక్ష్య"మని పండిట్ నెహ్రూ స్పష్టీకరించాడు.

కాంగ్రెస్ అధ్యక్షపదవి స్వీకరించిన పిదప పండిట్ నెహ్రూ తాను ఇదివరలో చెప్పినట్లుగా చేయగలరని అంతా ఆశించారు కాని, నూతన కార్యవర్గ సభ్యుల జాబితాను తిలకించేసరికి, "తెలుగు స్వతంత్ర" అన్నట్లు "కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు" అనే సామెత జ్ఞప్తికి వచ్చింది.

ఇది ఏమి కార్యవర్గం?

పండిట్ నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడగానే సుప్రసిద్ధ సిక్కు నాయకుడు బాబా ఖరక్ సింగ్ ఒక ప్రకటన చేస్తూ "నూతన వర్కింగ్ కమిటీ సభ్యులుగా ప్రజాభిమానులను, ప్రజల గౌరవ మర్యాదలను చూరగొన్నవారినే నియమించా"లని సూచించాడు. మిస్టర్ కిద్వాయ్ ఒక ప్రకటన చేస్తూ, "నూతన కార్యవర్గ సభ్యులుగా నియమింపబడే వారిపైనే పండిట్ నెహ్రూ కాంగ్రెస్‌ను ఎంతవరకు సంస్కరించగలడో ఆధారపడి వుండగల"దని అన్నాడు. నూతన వర్కింగ్ కమిటీ సభ్యుల జాబితాను పరిశీలించిన అనంతరం "కాంగ్రెస్ యథాప్రకారంగానే వుండగలదు" అని పేర్కొన్నాడు మిస్టర్ కిద్వాయ్.

మిస్టర్ కిద్వాయ్ చెప్పింది నిజం. బాబా ఖరక్ సింగ్ కోరినట్లు ఈ వర్కింగ్ కమిటీలో ఎందరు ప్రజానాయకులు వున్నారు? ప్రజల గౌరవ మర్యాదలను చూరగొన్న ప్రముఖులు ఎందరు కలరు?

ముఖ్యంగా కార్యదర్శుల నియామకం మిక్కిలి అసంతృప్తికరంగా నిరాశావహంగా వున్నది. ఈ కార్యదర్శులతోనే కాంగ్రెస్‌లో తాను తలపెట్టిన సంస్కరణను సాధించగలనని పండిట్ నెహ్రూ తలపోస్తున్నాడా? ఈ కార్యదర్శులతోనే తాను కాంగ్రెస్‌లో సాధించదలచిన "పరివర్తనాన్ని" కలిగించదలచిన "నూతనోత్తేజాన్ని" సాధించగలనని నెహ్రూజీ భావిస్తున్నాడా? వీరితోనే "స్వాతంత్ర్యసమరం నాటి ఉత్సాహోత్తేజాలను ప్రజలలో పెల్లుబికేటట్లు" చేయగలనని ఆయన అనుకుంటున్నాడా? తాను అధ్యక్షుడుగా వున్న మహాసంస్థకు కార్యదర్శిత్వం వహించడానికి వీరికి ఎంతవరకు అర్హతా యోగ్యతలు వున్నవో పండిట్‌జీ యోచించాడా? శ్రీటాండన్ కార్యవర్గంలో చేరని పండిట్‌జీ చింతించిన "మేధావంతులు, సమర్థులు" ఇట్టివారేనా!

ఉత్తరప్రదేశ్ పోలీస్‌శాఖా మంత్రిగా వున్న కార్యదర్శి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి మాట అలావుంచి. ఆ రెండవ కార్యదర్శిగా వున్న వ్యక్తి నామధేయంలో ప్రజాసామాన్యం మాట అలావుంచి అనుదినం వార్తాపత్రికలను కొంచెం శ్రద్ధాసక్తులతో పఠించేవారికి కూడా బొత్తిగా పరిచయం లేదు. ఈయన నామధేయం తెలుగు వార్తాపత్రికలలో గత అయిదు సంవత్సరాలలో రెండుమూడు పర్యాయాలు

మాత్రమే కనిపించింది. శ్రీ ప్రకాశం మంత్రివర్గం పతనమైన పిదప శ్రీ రెడ్డియార్ మంత్రివర్గంలో మంత్రిగా నియామకం సంభవమని ఒక పర్యాయం, కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ whipగా ఎన్నుకొనబడినట్లు మరొక పర్యాయం-అంతే!

రెండవ కార్యదర్శి అయిన శ్రీ శ్రీనివాస మల్లయ్యపట్ల మనకు ఎట్టి వ్యతిరేక భావం లేదు. నిజానికి, ఆయన గత చరిత్రను గురించి, ఇదివరలో ఆయన చేసిన మంచిచెడ్డలను గురించి మనకు ఏమైనా తెలిస్తే కదా, ఆయనపట్ల మనకు సుముఖభావమైనా, విముఖభావమైనా ఏర్పడడం! ఇట్టి అనామకుని అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శిగా నియమించడం ఎంతవరకు సమంజసం? సాధారణ పరిస్థితులలో ఎలావున్నా, ఇప్పటి సంక్లిష్ట పరిస్థితులలో ఇట్టి అననుభవజ్ఞులను, అనామకులను కార్యదర్శులుగా నియమించడం కాంగ్రెస్ మరింత బలహీనపడడానికే దోహదంచేస్తుంది. కాంగ్రెస్‌కు, దేశానికి ఏమి చేశారని, ఏమి చేయగలరని వీరిని కార్యదర్శులుగా పండిట్ నెహ్రూ నియమించారు? బాబూ టాండన్ కార్యదర్శులకంటె, కార్యవర్గంకంటె నెహ్రూ కార్యదర్శులు, కార్యవర్గం ఏవిధంగా మెరుగు?

సుమారు ఆరు సంవత్సరాలు కాంగ్రెస్‌ను అత్యంత చాకచక్యంతో, ప్రతిభావంతంగా సమర్థతతో నిర్వహించి, భారత ప్రజానీకం ఆదరాభిమానాలను చూరగొన్న మౌలానా సాహెబ్ వున్నాడు. అఖిలభారత రైల్వే కార్మిక సమాఖ్య అధ్యక్షపదవిని నిర్వహించి, భారత కార్మికుల విశ్వాసాన్ని చూరగొని, రెండు పర్యాయాలు మద్రాస్ కార్మిక మంత్రిగా వుండి, సింహళంలో ఇండియా హైకమిషనర్ పదవిని సమర్థతతో నిర్వహించిన శ్రీ వి. వి. గిరి వున్నాడు. చాలకాలం కాంగ్రెస్ కార్యదర్శి పదవిని నిర్వహించిన శ్రీదేవ్ వున్నాడు. ప్రస్తుతం కార్యదర్శులుగా నియమించబడిన వారికంటె అన్నివిధాల అధికులు అయిన అనేకమంది కాంగ్రెస్ ప్రముఖులు దేశంలో వున్నారు. వీరినందరిని విడిచి పుచ్చి, ఉత్తరప్రదేశ్ పోలీస్ శాఖామంత్రిగా అక్కడ కొంతవరకు నిరంకుశంగా పరిపాలించిన వ్యక్తిని, దక్షిణ కెనరాజిల్లా సరిహద్దులు దాటని పేరు ప్రఖ్యాతులు కల వ్యక్తిని కార్యదర్శులుగా నియమించడంలో నెహ్రూ ఉద్దేశం?

తాను ప్రధాని పదవిని, కాంగ్రెస్ అధ్యక్ష పదవిని నిర్వహించడం కష్టసాధ్యం. కాంగ్రెస్ అధ్యక్షపదవి కంటే ప్రధాని పదవీ నిర్వహణం ముఖ్యం కష్టం. కనుక దానిపట్లనే పండిట్ అధిక శ్రద్ధాసక్తులను ప్రదర్శించవలసి వుంటుంది. కాగా, పండిట్ నెహ్రూ కొంచెం ప్రమత్తతగా వున్నా, కాంగ్రెస్ సంస్థను తమకు తాముగా అత్యంత సమర్థతతో, కార్యదక్షతతో, ప్రతిభావంతంగా నిర్వహించుకొని పోగల ప్రజానాయకులను ఆయన కార్యదర్శులుగా నియమించి వుండవలసింది. అలా చేయకపోగా, కేవలం అనామకులను, సామాన్యులను కార్యదర్శులుగా నియమించిన పండిట్ నెహ్రూ శ్రీ టాండన్ కార్యవర్గాన్ని తొలగించడానికి అంత ఆర్భాటం ఎందుకు చేయవలసి వచ్చింది?

కాంగ్రెస్‌ను సమూలంగా సంస్కరించి, దానిని స్వాతంత్ర్యోద్యమం నాటివలె సజీవమైన, నవచైతన్య విలసితమైన ప్రజాసంస్థగా పునరుజ్జీవింప చేయడానికి తనకు లభించిన అమూల్యమైన మహత్తరావకాశాన్ని పండిట్‌జీ వినియోగించుకొనజాలడా?

అలా అయితే, "బ్లిట్జ్" పత్రిక అన్నట్లు "ఇక నెహ్రూను మనం రక్షించలేము; దేవుడు రక్షించవలసిందే."

---

హిందూమహా సభానాయకులను కమ్యూనిస్టులనీ, పరిపాలనాసమర్థులను మితవాదులని స్వీకరించక అసమర్థులు, అశిక్షితులు, ఆశాబద్ధులునైన వారితోనే శ్రీ నెహ్రూ పరిపాలనా భారమువహించుట, దేశమును నేటి పరిస్థితికి తెచ్చినది.

"త్రిలింగ."

# ఆంధ్ర కమ్యూనిస్టుల ఎన్నికల ప్రణాళిక

**చేకూరి రామారావు**

అన్ని పార్టీలతోబాటు కమ్యూనిస్టు పార్టీ కూడ తన ఎన్నికల ప్రణాళికను ప్రకటించింది. ఆ ప్రణాళికలోని వాంశములను "ఆంధ్ర పరిస్థితుల కన్వయించి, ఆంధ్ర ప్రజానీకాన్ని అన్ని అభ్యుదయ పార్టీలను, సంస్థలను, ప్రస్తుత కాంగ్రెసు ప్రభుత్వమునకు వ్యతిరేకంగా ఐక్యపరచి" కాంగ్రెసు ప్రభుత్వమును గద్దెనుండి దింపుటకు ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ తన ప్రత్యేక ఎన్నికల ప్రణాళికను ప్రకటించింది.

దేశ పురోభివృద్ధికి మిక్కిలి అనర్థదాయకమైన భూస్వామ్య విధానాన్ని రద్దుచేస్తామనీ, ఆంగ్ల సామ్రాజ్యవాదుల తాబేదార్లయిన పెట్టుబడిదారులను నాశనం చేస్తామనీ, విభజించి పాలించే బ్రిటిషు పాలకుల దమన నీతికి తార్కారణమైన కృత్రిమ రాష్ట్రాలను రద్దుచేస్తామనీ, ప్రజానీకానికి కూడు గుడ్డలకు కొదువ లేకుండా చేస్తామనీ, రామరాజ్యాన్ని అవతరింప చేస్తామనీ, ఇంకా ఏవేవో చేస్తామని కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలోకి వచ్చేముందు చేసిన వాగ్దానాలను ఏ విధంగా ఆచరించజాలకపోయినదీ నిశితంగా విమర్శిస్తూ వివరించిందా ప్రణాళిక.

అటువంటి అభివృద్ధి నిరోధక కాంగ్రెసు ప్రభుత్వాన్ని గద్దెనుండి దింపుటకు ఆంధ్రలోని "అన్ని అభ్యుదయ పార్టీలతోనూ, సంఘాలతోనూ, గ్రూపులతోనూ, వ్యక్తులతోనూ, సహకరించి ఎన్నికలలో పాల్గొన నిశ్చయించి" ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ తన ఎన్నికల ప్రణాళికను ప్రకటించింది.

పార్టీ తన ఎన్నికల ప్రణాళికను మూడు భాగాలుగా విభజించింది.

1. రాజ్యాంగ నిర్మాణంలో మార్పులు.
2. వ్యవసాయాభివృద్ధికి తక్షణసంస్కరణలు.
3. ఆంధ్ర పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన తక్షణ చర్యలు. వీటిని వేరు వేరుగా పరిశీలిద్దాం.

రాజ్యాంగ నిర్మాణంలో మార్పులు: "మద్రాసు రాష్ట్రాన్ని రద్దుచేసి భాషాప్రయుక్త రాష్ట్రాలను నిర్మించాలి. వెనువెంటనే ఆంధ్ర జిల్లాలను విడదీసి ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని ఏర్పరచాలి" అని ప్రణాళిక చెప్తోంది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి కమ్యూనిస్టు పార్టీ చూపుతున్న ఉత్సుకత అభినందనీయమే. కాని తీవ్ర వివాదగ్రస్థమైన మద్రాసు పట్టణ భవితవ్యమును స్పష్టం చేయకపోవటం పెద్దలోపం. కమ్యూనిస్టు పార్టీ పూర్వం మద్రాసు పట్టణంలో తమిళుల జనాభా ఎక్కువ గాబట్టి ఆ పట్టణం తమిళులకే చెందునని చెప్పినందువలన ఒకవేళ మద్రాసును (కమ్యూనిస్టు పార్టీ అధికారంలోకి వస్తే) తమిళులకే వదలి వేయునేమోనని అనుమానం కలుగుతున్నది.

హైదరాబాదు రాష్ట్రాన్ని రద్దుచేసి అక్కడి ఆంధ్ర ప్రాంతాలను ప్రజాభిప్రాయం ప్రకారం ఆంధ్ర జిల్లాలను కలిపి హైదరాబాదు నగరం రాజధానిగా చేయవలయుననియు, మైసూరు సంస్థానంలోని, ఒరిస్సాలోని తెలుగు భూములను ఆంధ్రలో చేర్చవలెననియు ప్రణాళిక ప్రకటించుట ముదావహము.

"ఏజన్సీ ప్రాంతాల నివసిస్తున్న కోయ, సవర మున్నగు వెనుకబడిన కొండ జాతులకు స్వపరిపాలనాధికారాలివ్వాలి. వారి ఆర్థిక, విద్యా విజ్ఞాన, ఆరోగ్యాభివృద్ధికి ప్రత్యేక సదుపాయాలను కలిగించే చట్టాలు చేయాలి" అని పార్టీ ప్రణాళికలో ఉంది. వెనుకబడియున్న ఈ కొండజాతి వారికి విద్య, విజ్ఞానం పూజ్యమన్న సంగతి మనకు విదితమే. వారికి ఆర్థిక విద్య, విజ్ఞాన సదుపాయాలను కలిగించే చట్టాలను చెయ్యాలనడం నిజంగా హర్షింపదగ్గదే. కాని ఆ కొండజాతులవారికి విద్యా విజ్ఞానాలను వ్యాపింప జేయకముందే స్వపరిపాలనాధికారమివ్వటం 'కోతికి కొబ్బరికాయ' ఇవ్వటం వంటిది.

అంటరానితనమును నిషేధించి వెనుకబడిన జాతుల నుద్ధరించుటకు కాంగ్రెసు ప్రభుత్వ మవలంబించిన విధానముకన్న వేరొక విభిన్న మార్గము ననుసరించి దానిని ఆచరణలోకి తీసుక రావాలని పార్టీ తన ప్రణాళికలో పేర్కొన్నది. వీరనుసరించనున్న ఆ మార్గమెట్టిదో ప్రణాళికలో స్పష్టీకరించబడలేదు.

వయోజన ఓటింగు పద్ధతిపై గ్రామపంచాయితీలకు అభ్యర్థుల నెన్నుకొని స్థానిక పరిపాలన సక్రమంగా సాగించవలెనని ప్రణాళికలో తెలియజేయబడింది. అయితే విద్యావిహీనులైన వయోజనుల ఓటింగు హక్కు అభ్యర్థుల నెన్నుకొనుటలో సద్వినియోగమవుతుందని 'గ్యారంటీ' లేదు. "హైస్కూలు కాలేజీలలో సైన్సుతదితర సాంకేతిక విద్యలు తెలుగు భాషలోనే బోధించు పద్ధతి ప్రవేశపెట్టాలి" అని ప్రణాళిక తెలియచేస్తున్నది. ఈ సాంకేతిక విద్యలు మొదటినుంచీ ఇంగ్లీషులోనే ఉండటంవల్ల వాటిని తెలుగులోకి తర్జుమా చేయటంలో చాలా తికమకలు పడవలసివస్తుంది. 1949 మార్చి స్కూల్ ఫైనల్ విద్యార్థులు ఇట్టి తర్జుమాలోని అవకతవక చవిచూచారు. సాంకేతిక శాస్త్రాలను తెలుగులోకి తర్జుమా చేయ ప్రయత్నించుట వృథాశ్రమే కాగలదు.

"పోలీసుదాడులకు కాల్పులకు గురై నష్టపోయిన, మృత్యువాతబడిన కుటుంబాలకు నష్టపరిహార మివ్వాలి" అనేది ప్రణాళికలోని మరియొక అంశము. కాంగ్రెసు ప్రభుత్వ హయాంలో ఇట్టి పోలీసు దౌర్జన్యాలు చాటుమాటుగా జరిగి, వాటిని ఋజువుపరచుటకు తగిన ఆధారాలు లేకపోవుటవలన బాధితులకు వీరు చెల్లింపదలచుకున్న నష్టపరిహార మే విధంగా అంచనా వేస్తారో అనూహ్యము.

రెండవది: వ్యవసాయాభివృద్ధికి తక్షణ సంస్కరణలు.

"కాంగ్రెసు ప్రభుత్వం జమీందార్లకు గుత్తదానంగా విడిచిపెట్టిన లక్షల ఎకరాల స్వంత కమతాలను ఎట్టి నష్టపరిహార మివ్వకుండా స్వాధీనంచేసుకుని కూలిరైతులకు పంచియివ్వాలి. పెద్ద భూస్వాములైన వారి భూములను పేద రైతాంగానికి పంచియివ్వాలి" అని పార్టీ ప్రణాళిక వివరించింది. ఈవిధంగా జమీందారుల స్వాధీనంలో వున్న భూములను రైతు కూలీలకు పంచియిస్తే ఆ భూములు చిన్న చిన్న ఖండాలవుతాయి. అట్టిఖండాలలో ఆధునిక వ్యావసాయిక యంత్ర సామగ్రి వుపయోగించటానికి వీలుండదు. అలాకాకుండా సమష్టి వ్యవసాయ క్షేత్రాల నేర్పాటు చేయాలంటే బాగుంటుంది.

ఇక మూడవది: ఆంధ్ర పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన తక్షణ చర్యలు.

దుంప నేతి పరిశ్రమ మొదలైన పరిశ్రమలను స్థాపించాలంటోంది ప్రణాళిక. దుంపనేయి ప్రజల ఆరోగ్యానికి భంగకరమని వైద్యుల యొక్కయు, శాస్త్రజ్ఞులయొక్కయు అభిప్రాయము. అట్టి దుంప నేతి పరిశ్రమను నిషేధించటానికిబదులు స్థాపించాలనడం ఇప్పటికే మనప్రజల నావరించిన అనారోగ్యాన్ని మరింత ఎక్కువచేయ ప్రయత్నించటమే కాగలదు.

"ధరల పెంపకాన్ని అనుసరించి అధిక ధరల ఎలవెన్సును పెంచాలి" అని పేర్కొంటున్నది ప్రణాళిక. అంటే పెరిగే ధరల నివృత్తినిబట్టి ఎలవెన్సులు పెంచటమే కాని పెరిగే ధరల నరికట్టేది లేదన్నమాట" వారి ప్రణాళిక ప్రకారం.

ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ తన కార్యక్రమాన్ని అమలుపరచుటకు శాసనసభలలోను, వెలుపల ప్రజలలోను కృషిచెస్తుందని హామీ యిస్తోంది.

తన "కార్యక్రమ మంతటితో గాని లేక ముఖ్యభాగంతో గాని అంగీకరించి, కాంగ్రెసు పార్టీని ఎన్నికలలో ఓడించటానికి పూనుకున్న అన్ని పార్టీలతోనూ, ప్రజా సంస్థలతోనూ, అందరు వ్యక్తులతోనూ చేయికలిపి పనిచేయుటకు" ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ నిశ్చయించింది.

శ్రీ జయప్రకాశ్ నారాయణగారి ప్రకటన ప్రకారం ప్రజాపార్టీ, సోషలిస్టుపార్టీ ఎన్నికలలో కమ్యూనిస్టులతో సహకరించవని తెలుస్తోంది. ఫార్వర్డుబ్లాకువారు ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీతో ఎన్నికల్లో సహకరించటానికి సుముఖంగా ఉన్నట్టుకూడా తెలుస్తోంది.

ఇటువంటి ఎన్నికల ప్రణాళికతో ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ ప్రజాభిమాన్ని ఎంతవరకు చూరగొంటుందో చూడవలసి ఉంది.



## మలేరియా మా బిడ్డను ఒకఊపు ఊపేసింది!

### తుదకు దానికి 'పాల్యుడ్రిన్' శరణ్యమైనది



అసలు మా బిడ్డను మేన
మామ ఇంటికి తీసుకువెళ్లక
పోతేనే బాగుండేదనిపిం
చింది. బడికి మరల చేర
వలసిన రోజునే, అది
మలేరియా మూలంగా మం
చం పట్టింది. కొద్దివారాల
లోనే నీరసపడి, తడపలాగ
అయిపోయింది. జ్వరతీవ్రత
దానిని కుదిపేసింది. ఎవ్వరూ
దానిని ఆపలేకపోయారు. తరు
వాత, ఒక మిత్రుని సలహాపై
బిడ్డకు రోజూ ఒక 'పాల్యుడ్రిన్'
బిళ్ల ఇస్తూవచ్చాము. మూడు
నాలుగు రోజుల లోపున జ్వరం
మాయమైనది. అప్పటినుంచి
మేమందరమూ ప్రతి ఆది
వారం భోజనానంతరం ఒక్కొక్క
'పాల్యుడ్రిన్' బిళ్లను సేవి
స్తున్నాము. మళ్లా మా కుటుంబంలో
ఎవరికీ మలేరియా సోకలేదు.



## పాల్యుడ్రిన్

ట్రేడ్ మార్కు

మలేరియా నివారణకు దివ్యౌషధం

ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడ్

Edited, Printed and Published by KHASA SUBBA RAU, at *Swatantra Printers*,